ప్రచురణ నెం. 7



నిర్వహణ :

**స్వామి యోగానంద**
**నాగమణి**

ప్రథమ ముద్రణ : 1994

ప్రతులు : 1000



**ధర : రూ. 15.00**

రవీంద్రనాథ్ టాగూర్‌గారి
**"Poems of Kabir"** కి
స్వేచ్ఛానువాదం

ప్రతులకు :

**చిక్కాల కృష్ణారావు**
"కృష్ణ నిలయం", గొల్లవీధి,
భీమునిపట్నం-531 163.
విశాఖ జిల్లా.

ముద్రణ :

శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్
సీతారామపురం, విజయవాడ-520 002. ఫోన్: 431422

# 1

ఓ భృత్యుడా, నువ్వు నన్ను ఎక్కడని వెదుకుతున్నావు?
నేను - నీ పక్కనే వున్నాను.

నేను దేవాలయంలో లేను. మశీదులో లేను.
కాబాలో లేను, కైలాసంలో లేను.
సదాచారాల్లో లేను. సంస్కారాల్లో లేను.
యోగంలో లేను. పరిత్యాగంలో లేను.

నువ్వు నిజమైన అన్వేషకుడవైతే,
ఓ క్షణంలో నువ్వు నన్ను కలుసుకుంటావు.

ఓ సాధూ, ప్రాణు లన్నింటికీ పరమేశ్వరుడు
ప్రాణమైవున్నాడు," అంటాడు కబీరు.

*    *    *

# 2

మహర్షి, ఏ కులస్థుడని అడగడం అనవసరం.
బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్యులేకాక,
తక్కిన కులాల వారూ ఒక్క రీతినే
ఈశ్వరాన్వేషణ చేస్తున్నారు.

మహర్షి ఏ కులస్థుడని అడగడం, అవివేకం.
మంగలి - చాకలి - వడ్రంగి ఈశ్వరాన్వేషణ చేశారు.

రాయదాస్ కూడా ఈశ్వరాన్వేషణ చేసినవాడే!
రుషి స్వపచ, పంచముడు.
ఏ భేదమూలేని ఆ లక్ష్యాన్ని
హిందువులు - మహమ్మదీయులు
ఒకే విధంగా సాధించారు.

* * *

## 3

ఓ సాధూ, బ్రతికి వుండగానే ప్రభువు కోసం
ఆశతోవుండు.
జీవితంలోనే విమోచన వుంది కనుక,
ఆయన్ని దర్శించి, అవగాహన చేసుకో.

జీవించి వుండగానే నువ్వు బంధ విముక్తుడవు కాకపోతే,
మృత్యువుతో, విమోచన కలుగుతుందనే ఆశ ఏమిటి?

"దేహాన్ని విడిచిన ఆత్మ, ఆయనలో ఐక్యమౌతుంది"
అనేది, వట్టి కల.

ఇప్పుడు ఆయన్ని దర్శిస్తే, అప్పుడూ ఆయన్ని దర్శిస్తావు.
అలా కాకపోతే నరకానికి పోతావు.

ఇప్పుడు నువ్వు ఐక్యమైతే, అప్పుడూ ఐక్యమౌతావు.
సత్యంలో ఓలలాడు. సద్గురువును, తెలుసుకో.
సత్యనామంలో విశ్వాస ముంచు.

"అన్వేషణోత్సాహ మొక్కటే, దానికి సహకరిస్తుంది.
ఆ అన్వేషణోత్సాహానికి, నేను బానిసను," అంటాడు కబీరు.

* * *

# 4

పూల తోటలోకి వెళ్ళవద్దు.
ఓ సాధూ, అక్కడకు వెళ్ళకు.
నీ దేహంలోనే, పూల వనం వుంది.

సహస్రదళ పద్మంపై ఆసీనుడవై,
అతనంతమైన ఆ సౌందర్యాన్ని వీక్షించు.

* * *

# 5

ఓ సోదరా, మాయనుంచి బైటపడే మార్గం చెప్పు.
పట్టు బట్టల్ని - మడి బట్టల్ని వదలి పెట్టినా,
మామూలు బట్టల్ని ధరించడం మానలేదు,

ఆ బట్టల్ని కూడా వదిలేసినా,
దేహాన్ని దాన్ని మడతల్లో దాస్తూనే వున్నాను.

మోహాన్ని వదిలిపెట్టినా,
ఆగ్రహం మిగిలి వుండటం గమనించాను.

ఆగ్రహాన్ని వదలిపెట్టినా, లోభం వుండనే వుంది నాలో,
లోభం ఓడిపోయినా, గర్వం - వ్యర్థ ఆడంబరం
మిగిలేవున్నాయి.

మనసు "మయా" అనే మాటను మాత్రమే
వేరుచేసి - దూరంగా విసిరేసిందే కాని,
అసలు మాయను పట్టుకుని వేళ్ళాడుతోనే వుంది.

ప్రియమైన ఓ సాధూ, నా మాట విను:
సరైన మార్గం, అరుదుగా కనుక్కోబడుతుంది."
అంటాడు కబీరు.

*    *    *

## 6

నా దేహంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు.
కాని, నా అంధత్వం చంద్రుణ్ణి చూడలేదు.

నాలో సూర్య - చంద్రులున్నారు,
శాశ్వతత్వపు భేరీ మోగించకుండానే
నాలో నినదిస్తోంది. కాని, నాకు చెవుడు, దాన్ని వినలేను.

"నేను - నాది" అని మనిషి గోలపెడుతున్నంత కాలం,
అతని పనులు సఫలం కావు.

"నేను - నాది" అనే మమకారం నశించినప్పుడు,
ప్రభువు కార్యం నెరవేరుతుంది.

కర్మ పరమార్థం, జ్ఞానార్జన.
జ్ఞానోదయమైనప్పుడు - కర్మ విసర్జింపబడుతుంది.
ఫలంకోసం, పువ్వు విచ్చుకుంటుంది.
కాయ బయటికిరాగానే, పువ్వు వాడిపోతుంది.

కస్తూరి తనలో వున్నా, మృగం దాన్ని తనలో
వెతుక్కోకుండా, బైట వెతుక్కుంటూ తిరుగుతుంది.

* * *

# 7

మనం ఎప్పటికీ దేనినైతే చూడలేమో, దాన్ని
పరబ్రహ్మ సృష్టి రూపంలోకి తీసుకొచ్చి,
అసలు తానేమిటో వ్యక్తమౌతాడు.

మొక్కలో విత్తనం, చెట్టులో నీడ, ఆకాశంలో శూన్యం,
ఆ శూన్యంలో అనంత రూపాలు వున్నట్లు:

నిరక్షరుని నుంచి అక్షరుడు ఆవిర్భవించాడు,
ఆ అక్షరుని నుంచి, క్షరుడు విస్తరించాడు.

పరమేశ్వరునిలో జీవుడు, జీవునిలో పరబ్రహ్మ వున్నారు.
వారు విడిగా వున్నా, ఎప్పుడూ కలిసే వుంటారు.

ఆయనే వృక్షం, అంకురం.
ఆయనే పుష్పం, ఫలం, ఛాయ.
ఆయనే ఆదిత్యుడు, కాంతి, ప్రకాశం,
ఆయనే పరబ్రహ్మ, జీవుడు, మాయ.
ఆయనే అనంతరూపాలు, అనంత ఆకాశం.

ఆయనే ప్రాణం, శబ్దం, అర్థం.
ఆయనే మితం అమితం ఆయన ఆ రెండింటికీ
అతీతంగా, శుద్ధ బ్రహ్మగా వున్నారు.
బ్రహ్మలో, జీవునిలో ఆయన శుద్ధ మనసుగా వున్నారు.

ఆత్మలో పరమాత్మ, పరమాత్మలో బిందువు,
బిందువులో ప్రతిబింబం దర్శనమౌతుంది.
ఆ దివ్య దృశ్యాన్ని దర్శించిన కబీరు ధన్యుడు.

* * *

# 8

ఈ మట్టి కుండలోనే పొదరిళ్ళూ, పూల తోటలూ
వున్నాయి.
దీంట్లోనే సృష్టికర్తా వున్నాడు.
ఈ మృణ్మయ పాత్రలోనే సప్తసముద్రాలు,
అగణిత నక్షత్రాలు వున్నాయి.

దీంట్లోనే గీటురాయి, షరాబు వున్నారు.
ఈ ఘటంలోనే శాశ్వతత్వం ధ్వనిస్తోంది.
ఇందులోనే జీవజలం ఉప్పొంగుతోంది.

"ఓ సాధూ నా మాట విను:
నా ప్రియమైన ప్రభువు, లోపలేవున్నారు," అంటాడు కబీరు

*          *          *

# 9

ఆ శబ్దార్థాన్ని నేనెట్లా వ్య క్త పరచగలను?
ఆయన ఈ విధంగాలేరనీ, ఆ విధంగా వున్నారనీ
నేనెట్లా చెప్పగలను?

ఆయన నాలో వున్నారంటే, లోకం నవ్వుతుంది.
ఆయన నాకు విడిగా, బైట వున్నారంటే,
అది అసత్యం అవుతుంది.

ఆయన నా లోపలా - బైటా ప్రపంచాల్ని
విడదీయ శక్యంకాకుండా ఏకాం చేశారు.

చిత్ - అచిత్ రెండూ ఆయన పాద పీఠాలు.

ఆయన ప్రత్యక్షంగానూ లేరు, మరుగుపడీలేరు.
ఆయన బహిరంగం కాలేదు. రహస్యంగా దాక్కోలేదు.

అసలు ఆయన ఏమిటో చెప్పడానికి మాటలే లేవు.

*          *          *

# 10

ఓ ఫకీర్! నువ్వు నా ప్రేమను ఆకర్షించావు.
నేను నా గదిలో నిద్రపోతుండగా,

నీ గానంతో, నన్ను తట్టావు.

నేను ఈ భవసాగరంలో పడి మునిగిపోతుండగా,
నీ చేతుల మీదుగా నన్ను పైకెత్తి రక్షించావు.

ఓ ఫకీర్, ఒకే ఒక్క మాటతో
నువ్వు నా బంధాలన్నింటినీ ఛేదించావు.

"ఓ ఫకీర్, నీ హృదయంతో నా హృదయాన్ని
ఏకం చేశావు" అంటాడు కబీరు

*　*　*

# 11

రాత్రింబవళ్ళు నేను మిత్రులతో కలసి క్రీడించాను.
కాని, ఇప్పుడు నేనెంతో భయపడుతున్నాను.

నా ప్రభువు భవనం, చాలా ఎత్తున వుంది.
ఆ సోపానాలన్నీ అధిరోహించడానికి,
నా హృదయం వణకుతోంది.

ఆయన ప్రేమను నేను అనుభవించినట్లయితే,
నేను సిగ్గు పడనవసరం లేదు.

నా హృదయం, నా ప్రియుని హృదయాన్ని హత్తుకోవాలి.
నేను, నా ముసుగును తొలగించుకోవాలి.
నా దేహమంతటితో, ఆయన్ని ఆలింగనం చేసుకోవాలి.

ప్రేమ జ్యోతుల దీపోత్సవాన్ని,
నా నయనాలు జరుపుకోవాలి.

"ఓ సాధూ, నా మాట విను:
ప్రేమించినవాడు, అర్థం చేసుకుంటాడు.
నీ ప్రియతముని కోసం నువ్వు ప్రేమతో
తపన పడకపోతే,
నీ దేహాన్ని అలంకరించుకోవడం,
కనురెప్పలకు కస్తూరి పూసుకోవడం, వృథా:"
అంటాడు కబీరు

* * *

## 12

ఓ హంసా, నీ గత చరిత్ర నాకు చెప్పు.
నువ్వు ఏ ప్రదేశం నుంచి వచ్చావు?
ఓ హంసా, నువ్వు ఏ తీరానికి ఎగిరిపోతావు?

ఓ హంసా, నువ్వు ఎక్కడ విశ్రమిస్తావు?
దేన్ని వెదుకుతున్నావు?

ఓ హంసా, ఈ ఉదయమైనా మేల్కో!
లేచి, నన్ను అనుసరించు.

దుఃఖం, సంశయంలేని ప్రదేశం వుంది.
అక్కడ మృత్యుభీతి లేశమాత్రంలేదు.

అక్కడ వసంతం వచ్చింది. వనం పూసింది.
"త్వమేవహం" అనే పరిమళ గంధం గాలిలో వ్యాపించింది.
అక్కడ "హృదయ" మనే మధుపం, లోతుగా మునిగి,
మరే ఆనందాన్ని వాంఛించడం లేదు.

* * *

# 13

స్వయంభువైన ఓ ప్రభూ, నిన్నెవరు సేవిస్తారు?

ప్రతి భక్తుడూ, తాను సృష్టించుకున్న దైవాన్ని
పూజిస్తాడు.
ప్రతిరోజూ ఆ భక్తుని సేవలు ఆయన అందుకుంటాడు.

పరిపూర్ణుడు - పరబ్రహ్మ - అభేద్యుడు అయిన ఆయన్ని,
ఎవరూ అన్వేషించరు.

వారు దశావతారాల్ని నమ్ముతారు.
ప్రతి అవతారమూర్తీ,
తాను చేసిన కర్మ ఫలితాన్ని అనుభవిస్తాడు.

కాని, ఏ అవతారమూర్తి, అసలు పరమాత్మకాదు.
పరబ్రహ్మ వీటన్నింటికీ భిన్నంగా వుంటాడు.

యోగి - సన్యాసి - సాధువులు - వారు
ఒకరితో ఒకరు, తర్కించుకుంటారు.

ఓ సోదరా, ప్రేమ ప్రకాశాన్ని దర్శించినవాడు,
రక్షింపబడ్డాడు.

* * *

## 14

నదీ, దాని తరంగం ఒకటే నీరు.
నదికి, తరంగానికి తేడా ఎక్కడ వుంది?

తరంగం - పైకి లేచినప్పుడు, కింద పడ్డప్పుడు
అది ఒకటే నీరు. వ్యత్యాసం ఎక్కడ వుంది?

"తరంగం" అని దానికి పేరు పెట్టడం చేత,
దాన్ని నీరుగా భావించరా?

జపమాలలోని పూసలవలె,
పరబ్రహ్మలో ప్రపంచాలన్నీ వున్నాయి.

ఆ జపమాలను జ్ఞానదృష్టితో చూడు.

* * *

# 15

ఋతురాజైన వసంతం రాజ్యమేలేచోట,
అనాహతనాదం వినపడుతుంది.
అక్కడ, కాంతి వాహినులు
దశదిశలా జాలు వారతాయి.
కొందరే ఆ తీరానికి వెళ్ళగలరు.

శతకోటి కృష్ణులు ముకుళిత హస్తాలతో
ఎక్కడ నిలబడ్డారో,
శతకోటి విష్ణువులు ఏ చోట తలలు వంచారో,
శతకోటి బ్రహ్మలు ఎక్కడ వేదం పఠిస్తున్నారో,
శతకోటి ఇంద్రులు ఎక్కడ విహరిస్తున్నారో,
శతకోటి రుద్రులు ఎక్కడ ధ్యాన నిమగ్నులైనారో,
శతకోటి యతీంద్రులు ఏ తావున వున్నారో,
సంగీత సంపన్నులైన శతకోటి సరస్వతులు
ఏ చోట వీణలు వాయిస్తున్నారో,
అక్కడ,
గంధం - పూల పరిమళం నివాసంగావున్న ఆ లోతుల్లో—
నా ప్రభువు స్వయంగా వ్యక్తమై వున్నారు.

  

## 16

"చిత్ - అచిత్" అనే స్తంభాల మధ్య,
మనసు ఉయ్యాల ఊగుతోంది.
సమస్త ప్రాణికోటి, సర్వలోకాలు
వాటిమీద వేళ్లాడుతున్నాయి.
ఆ ఊపు ఎప్పుడూ ఆగదు.

అక్కడ లక్షలాది ప్రాణులున్నాయి.
సూర్య - చంద్రాదులు తమ తమ గమనాల్లో వున్నారు.
వేలాది యుగాలు నడచినా, ఆ ఊపు అట్లానే వుంది.
ఆకాశం - వాయువు - పృథ్వి - అగ్ని - జలం
సమస్తం వూగుతున్నాయి.
ప్రభువు స్వయంగా రూపం ధరించారు.
ఆ దృశ్యం, కబీరుని దాసుణ్ణి చేసింది.

* * *

## 17

సూర్య - చంద్ర - నక్షత్రాల కాంతి, తేజోవంతంగా వుంది.
ప్రేమమాధుర్యం, ఉప్పొంగుతోంది.
ప్రేమ - వైరాగ్యం" అనే లయ, కాలాన్ని కదిలిస్తోంది.

రెబవళ్ళు, సంగీత స్వరాలతో స్వర్గాన్ని నింపుతున్నాయి.
"నా ప్రియమైన ప్రభువు ఆకాశంలో
మెరపువలె మెరుస్తున్నాడు," అంటాడు కబీరు.

కాలం ఏ విధంగా తన ఆరాధనను
అనుష్ఠిస్తున్నదో నీకు తెలుసా?
రాత్రి - పగలు, విశ్వారాధనతో తమ దీపాల తోరణాల్ని
అటూ, ఇటూ వూపుతో పాడుతున్నాయి.

అక్కడ మరుగుపడిన పతాకం,
నిగూఢమైన నీలపు చాందినీ వున్నాయి.
కనుపించని ఘంటారావం వినిపిస్తుందక్కడ.

"అక్కడ విశ్వేశ్వరుడు తన ఉన్నతాసనంమీద కూర్చుని
వున్నాడు. అక్కడ ఆరాధన ఎప్పుడూ ఆగదు," అంటాడు
కబీరు.

* * *

సమస్త ప్రపంచం తన పనుల్ని తాను చేసుకుంటుంది.
అలాగే అది కొన్ని పొరపాట్లూ చేస్తుంది.
కాని, ప్రియుని తెలుసుకున్న ప్రేమికులు కొందరే వున్నారు.

గంగా, యమునలు సంగమించినట్లే,
ప్రేమ - వైరాగ్యాలనే శక్తివంతములైన ప్రవాహాల్ని
హృదయంలో ఏకం చేసుకున్నవాడే, అత్యంత ఆసక్తికల
అన్వేషకుడు.

అటువంటి అన్వేషకుని హృదయంలో,
ఆ పవిత్రోదకం రాత్రిం - బవళ్ళు ప్రవహించి,
అతని జనన - మరణ వలయాన్ని అంతం చేస్తుంది.

చూడు! పరమాత్మలో ఎంత శాంతో!
ఆ శాంతి పొందాలని చూసినవాడు, దాన్ని అనుభవిస్తాడు.

ప్రేమ తీరాలమధ్య, ఆనంద సాగరం
ముందు - వెనుకలకు వూగుతోంది.
బ్రహ్మాండమైన నాదం, గానంవలె వెలువడుతోంది.

నీరు లేకుండా ఎటువంటి పద్మం వికసిస్తోందో చూడు!
"నా హృదయ మధుపం, దాని మకరందాన్ని
తాగుతోంది," అంటాడు కబీరు.

*　　　*　　　*

విశ్వహృదయ కేంద్రంలో వికసించిన పద్మం,
ఎంత అద్భుతంగా వుందో!
పవిత్రాత్ములైన కొద్దిమందే, దాని నిజమైన
ప్రసన్నతను తెలుసుకోగలుగుతారు.

దాని చుట్టూ సంగీతం వినిపిస్తూ వుంటుంది.
ఆ అనంత ఆనంద సాగర ఐశ్వర్యాన్ని,
హృదయం తనూ పాలుపంచుకుంటోంది.

ఆ మధురానంద సాగర గర్భంలో మునుగు.
ఆ విధంగా జనన - మరణ దోషాలన్నీ నివృత్తి కానియ్యి,"
అంటాడు కబీరు.

పంచేంద్రియాల తృష్ణ అక్కడ ఏ విధంగా అణగుతోందో,
గమనించు. అటుపైన త్రి విధాలైన దుఃఖాలు
ఏ మాత్రం వుండవు.

"అది అనుభవించ శక్యంకాని పరమేశ్వరుని లీల.
అగోచరుని శీతల కిరణాలు ఏ విధంగా
ప్రకాశిస్తున్నాయో చూసి తెలుసుకో," అంటాడు కబీరు.

అక్కడ జనన - మరణ స్పందన ఆగుతుంది.

పరమానందం ఉప్పొంగుతోంది.
విశ్వమంతా తేజస్సుతో నిండివుంది.

అనాహత నాదం వినవస్తోంది. అది త్రిలోకాల ప్రేమ గానం.

అక్కడ సూర్య - చంద్రాదుల
అసంఖ్యాక దీపాలు వెలుగుతున్నాయి.

భేరీ మోగుతోంది. ప్రియుడు ఆటలో ఊగుతున్నాడు.

ప్రేమ గీతాలు, మారుమోగుతున్నాయి.
కాంతి, జల్లులుగా పడుతోంది.
స్వర్గలోకపు అమృతాస్వాదనలో
ఆరాధకుడు తన్మయత్వంలో వున్నాడు.

జనన - మరణాల వంక చూడు. వాటి మధ్య భేదం లేదు.
కుడిచెయ్యి - ఎడంచెయ్యి రెండూ ఒకటే - సమానమే.
ఈ పరమ సత్యం వేదాల్లోగాని, గ్రంథాల్లోగాని కనపడదు,
కనుక వివేకి మౌనంగా వుంటాడు" అంటాడు కబీరు.

* * *

నా స్థానం, స్వాత్మారామునిలో వుంది,
వర్ణనాతీతమైన దాన్ని తాగిన మత్తులో వున్నాను.
రహస్యాతి రహస్యమైన దాని మర్మాన్ని కనుక్కున్నాను.
సంయోగ మూలాన్ని చేరుకున్నాను.
గమ్యమంటూ లేకుండా ప్రయాణంచేసి
దుఃఖరహిత ప్రదేశం చేరుకున్నాను.
పరమేశ్వరుని దయ నాపై సులభంగా నిలిచింది.

అనంతుడని, అతీతుడని ఆయన్ని కీర్తించారు.
కాని, నేను ఆయన్ని రూపరహితునిగా ధ్యానంలో దర్శించాను.
అది నిశ్చయంగా దుఃఖరహిత ప్రదేశమే!
అక్కడకు చేరే మార్గం ఎవరికీ తెలియదు.
ఆ మార్గాన నడిచేవారు మాత్రమే,
సమస్త దుఃఖాల్ని అధిగమించగలరు.

ఏ పుణ్యం వల్లా పొందలేని ఆ శాంతిమయ ప్రదేశం,
అద్భుతంగా వుంది.
జ్ఞానులే దాన్ని దర్శించారు. వివేకులే దాన్ని శ్లాఘించారు.
ఇదే కడపటి మాట.
కాని, దాని అద్భుతమాధుర్యాన్ని ఎవరైనా వ్యక్తపరచగలరా?
దాన్ని ఒకసారి రుచి చూసిన వారు,
అది ఎంత ఆనందాన్ని ఇవ్వగలదో తెలుసుకోగలరు.

దాన్ని తెలుసుకుని, మూర్ఖుడు వివేకవంతుడౌతాడు.
వివేకి, మాట్లాడటం మానేసి మౌనం వహిస్తాడు,"
అంటాడు కబీరు.
ఆరాధకుడు పూర్తి తన్మయత్వంలో మునిగిపోతాడు.

అతని జ్ఞానం - వైరాగ్యం పరిపూర్ణమౌతాయి.
ప్రతి ఉచ్ఛ్వాస - నిశ్వాసల్లో అతడు ఆ ఆనందాన్ని
ప్రేమ పాత్రతో తాగుతాడు," అంటాడు కబీరు.

* * *

అక్కడ ఆకాశమంతా దివ్యనాదంతో నిండివుంది.
ఆ నాదం, తంత్రులు లేకుండా,
కొనవేళ్ళతో మీటకుండానే వెలువడుతోంది.
సుఖ - దుఃఖాలనే క్రీడ, అంతరించదక్కడ.
నీ జీవితాన్ని జీవన సాగరంలో ముంచితే,
తిరిగి దాన్ని ఆనందమయమైన దివ్యక్షేత్రంలో
దర్శిస్తావు," అంటాడు కబీరు.

ప్రతిక్షణం, ఎటువంటి ఆనంద పారవశ్యంతో
గడుస్తోందో చూడు!
ఆరాధకుడు ఆ కాల మాధుర్యాన్ని పిండి,
ఆస్వాదించి, పరబ్రహ్మలో జీవిస్తాడు.

జీవితంలో సత్యాన్ని అంగీకరించి,
దానికి కట్టుబడివున్నాను కనుక,
నేనిప్పుడు సత్యమే మాట్లాడతాను.
అందుచేత డాబురేకు లన్నింటినీ తుడిచిపారేశాను.

ఆ విధంగా ఆరాధకుడు భయంనుంచి విముక్తుడైనాడు.
అతన్ని జనన - మరణభ్రమలు వదులుతాయి,"
అంటాడు కబీరు:

అక్కడ ఆకాశమంతా సంగీతంతో నిండివుంది.
అది అమృతాన్ని వర్షిస్తోంది.
వీణతీగలు ఝల్లు - ఝల్లు మంటున్నాయి.
భేరీలు నినదిస్తున్నాయి.
ఆకాశసౌధంలో నిగూఢ తేజస్సు
ఎంత అద్భుతంగావుంది!
అక్కడ సూర్యాస్తమయ - సూర్యోదయ ప్రసక్తిలేదు.
ప్రేమ ప్రకాశమానమైన యీ సృష్టి విలాసంలో,
రాత్రి, పగలు రెండూ ఒకటేననే
అనుభూతి కలుగుతోంది.

అక్కడ ఎప్పుడూ ఆనందంగానే వుంటుంది కాని,
దుఃఖం, యాతన వుండవు.
అక్కడ అంచుల వరకూ నిండిన సంతోషాన్ని,
పరిపూర్ణతనూ చూశాను.
అక్కడ పొరపాట్లకు తావులేదు.
అక్కడ పరమేశ్వరుని విలాసం దర్శించాను,"
అంటాడు కబీరు.

*　　　*　　　*

నా దేహంలో కూడా విశ్వలీలే వున్నదని తెలుసుకుని,
ఈ ప్రపంచ ప్రమాదం నుంచి తప్పించుకున్నాను.
లోపలా - బైటా ఒకటే చిదాకాశం,
ఆత్మ - పరమాత్మ ఏకమైవున్నాయి.
ఇదంతా చూసిన మైకంలో వున్నాను.

జ్ఞానమనే ప్రమిదలో వెలిగే నీదైన ప్రేమజ్యోతి కాంతి,
విశ్వమంతటినీ సఫలీకృతం చేస్తోంది.
అక్కడ — అవిద్యకు తావులేదు.
జనన — మరణాల ఘర్షణేవుండదు,'' అంటాడు కబీరు.

*　　　*　　　*

## 18

తేజోనాదంతో నిండిన ఆకాశం మధ్యలో
ఆత్మవుంది.
పవిత్రమైన, స్వచ్ఛమైన సంగీతం వినబడే
ఆ చోట, నా ప్రభువు ఆనందిస్తో వుంటారు.

ఆయన ఒంటిమీది ప్రతి రోమం యొక్క—
అద్భుత తేజస్సులో, లక్షలాది సూర్య - చంద్రుల
కాంతి, హీనంగా వుంటుంది.

ఆ తీరాన ఒక నగరం వుంది.
అందు అవిరామంగా అమృతం వర్షిస్తోంది.

''ఓ ధర్మ దాసుడా. రా!
వచ్చి, నా ప్రభువు దర్బారు దర్శించు,'' అంటాడు కబీరు.

*　　　*　　　*

## 19

ఓ నా హృదయమా
పరమాత్మమైన సద్గురువు నీ దగ్గరే విరాజిల్లు తున్నారు.
మేలుకో! మేలుకో!!

నీ తల దగ్గరే నిలబడ్డ
నీ ప్రియతముడైన ప్రభువు పాదాల చెంతకు
పరిగెత్తు.

యుగయుగాల నుంచి నువ్వు నిద్రపోతున్నావు.
ఈ ఉదయమైనా మేల్కోవా?

*　　　*　　　*

## 20

ఓ మనసా, నువ్వు ఏ తీరానికి వెళ్ళదలిచావు?
నీ ముందు బాటసారి లేడు. బాటా లేదు.
ఆ తీరాన తిరగడమెక్కడ? ఆగడమెక్కడ?

అక్కడ నీళ్ళులేవు. నావాలేదు. నావికుడూ లేడు.
నావను కట్టేందుకు, తాడూ లేదు.

దాన్ని లాగేందుకు, మనిషిలేడు.
అక్కడ భూమి — ఆకాశం — కాలం ఏమీలేవు.
ఒడ్డూలేదు — రేవూలేదు.

అక్కడ మనసూలేదు. దేహమూలేదు.
ఆత్మ దాహం తీరేందుకు, అక్కడ చోటెక్కడవుంది?

ఆ శూన్యంలో నువ్వేమీ కనుక్కోలేవు.
కనుక, ఉన్నచోటనే స్థిరంగా, దృఢంగా, ధైర్యంగా వుండు.
అంతర్ముఖుడవై వుండు.

అక్కడే నీకు స్థిరత్వం లభిస్తుంది.
ఓ మనసా, దాన్ని బాగా యోచించి, ఇంకెటూ కదలకు.

"ఊహలన్నింటినీ దూరంగాపెట్టు.
అసలు నువ్వేమిటో తెలుసుకుని,
నీలో నువ్వు స్థిరంగా నిలబడు," అంటాడు కబీరు.

* * *

# 21

ఓ అంధుడా, ఇంటింటా దీపాలు వెలుగుతున్నాయి.
నువ్వు వాటిని చూడలేవు.
ఒకరోజున నీ కళ్ళు అకస్మాత్తుగా తెరచుకుంటాయి.
అప్పుడు నువ్వు ఆ దీపాల్ని చూస్తావు.
ఆ తర్వాత మృత్యు సంకెళ్ళు నీ నుంచి విడిపోతాయి.

చెప్పడానికి, చెయ్యడానికి, వినడానికి ఏమీలేదు.
ఎవడైతే చచ్చి బ్రతుకుతాడో, వాడెప్పటికీ చావడు.

తాను ఏకాంతంగా జీవిస్తూ,
తన నివాసం దూరాన వుంటున్నాడు యోగి.
నీ ప్రభువు నీ దగ్గరేవున్నా, ఆయన్ని వెదకడానికి
నువ్వు తాటిచెట్టు ఎక్కుతున్నావు.

ప్రజలకు మతదీక్షా ప్రదానం చేస్తూ
బ్రాహ్మణ పురోహితుడు ఇంటింటికి తిరుగుతున్నాడు.
ఉప్పొంగే నిజమైన జీవనధార, నీ పక్కనే వుంది.
కాని, నువ్వు పూజించడానికి ఒక రాయి పెట్టుకున్నావు.

"నా ప్రభువు ఎంత మధురమూర్తో,
నువ్వు ఎప్పటికీ చెప్పలేకపోవచ్చు.
యోగం, జపమాల తిప్పడం, సుగుణం - దుర్గుణం
ఇవన్నీ ఆయనకు పట్టవు," అంటాడు కబీరు.

* * *

# 22

ఓ సోదరా, నిజమైన ప్రేమతో నిండిన పాత్ర నుంచి
ముందు తాను తాగి, తర్వాత దాన్ని
నాకు తాగడానికి అందించే నిజమైన
సద్గురువు కోసం, నా హృదయం ఆరాటపడుతోంది.

కళ్ళను కమ్మిన మాయతెరను తొలగించి,
పరమాత్మ దర్శనభాగ్యం కలిగిస్తారాయన.
ఆయన, తనలో ప్రపంచాల్ని బహిరంగ పరుస్తారు.

అనాహత సంగీతాన్ని నేను వినేటట్లు చేస్తారు.
సుఖ - దుఃఖాలు రెండూ ఒకటేనని చూపుతారు.
మాటల్ని ప్రేమతో నింపుతారు.
"సురక్షితమైన ప్రదేశానికి
నడిపించుకుపోయే సద్గురువు దొరికినవాడు,
ఏ మాత్రం భయపడనవసరంలేదు," అంటాడు కబీరు.

* * *

## 23

సాయంత్రం నీడలు దట్టంగా కమ్ముకున్నాయి.
మోహాంధకారం మనసునీ, శరీరాన్ని
కమ్ముతోంది.

పశ్చిమ ద్వారం తెరచి, ప్రేమాకాశంలో కలిసిపో.
హృదయ పద్మదళాలలోని మధురమైన మధువును
తాగు.

సముద్రతీరం ఎంత గొప్పగా శోభిస్తోంది!
దాని కెరటాల్ని నీ దేహంలోకి తీసుకో.

శంఖారావం, గంటల గణగణలు వినవస్తున్నాయి.
విను.
"ఓ సోదరా, చూడు—
నా దేహమనే ఈ ఘటంలో, ప్రభువు వున్నారు,"
అంటాడు కబీరు.

*  *  *

# 24

ఈ ప్రపంచంలో అనంత జీవితాన్ని
వికసింపజేసే ప్రేమను, నా హృదయంలో
అన్నింటికంటే ప్రియాతి ప్రియమైనదిగా నిలుపుకుంటాను.

ఆ ప్రేమ - నీటిలో పెరిగి, నీటిలో వికసించే
పద్మం మాదిరిగా వుంది. కాని, ఆ పద్మ పత్రాల్ని
ఆ నీరు తాకలేదు.
ఆ పద్మం నీటికి అందక, ఎత్తున వికసిస్తుంది.

ప్రేమ ఆజ్ఞానుసారం సహగమనం చేసే
సతి మాదిరిగా వుంది, ఆ ప్రేమ.
పతి చితిమీద సతి కాలిపోతూ,
ఇతరులను దుఃఖపెడుతుందే గాని,
ప్రేమను మాత్రం అగౌరవ పరచదు.

అగాధమైన ఈ భవసాగరం దాటడం, బహు కష్టం.
ఆ సాగరం, చాలా లోతుగావుంది.

"ఓ సాధూ, నేను చెప్పేది విను:
దాని అవతలి తీరం చేరుకున్నవారు
బహుకొద్ది మందే వున్నారు", అంటాడు కబీరు.

* * *

# 25

నా ప్రభువు, ఆయనకు ఆయనే దాగి వుంటారు.
మళ్ళా ఆయనకు ఆయనే అత్యద్భుతంగా వ్యక్తమౌతారు.

నా ప్రభువు నన్ను గాఢంగా హత్తుకున్నారు.
నా వ్యక్తిత్వపు పరిధుల్ని ఆయన కూలతోశారు.

నా ప్రభువు నాకు సుఖ - దుఃఖ వార్తల్ని తెస్తారు.
వాటి పోరాటాల్ని ఆయనే నివృత్తి చేస్తారు.
నా ప్రభువుకి నా శరీరాన్ని, మనసునీ అర్పించుకుంటాను,
నా జీవితాన్నైనా ఒదులుకుంటాను కాని,
ఆయన్ని ఎన్నటికీ మరచిపోను.

* * *

# 26

సమస్తం ఓంకారం నుంచే ఉద్భవించింది.
ఆయన దేహమే ప్రేమ స్వరూపం.
ఆయన రూపరహితుడు - నిర్గుణుడు - నాశన రహితుడు.
ఆయనతో ఐక్యం కావడానికి యత్నించు.
కాని, ఆయన తాను సృష్టించిన ప్రాణుల దృష్టిలో
అనంతరూపాలు ధరించాడు.
ఆయన పవిత్రుడు - అమృతుడు - అనంతరూపుడు—
అంతు తెలియనివాడు.
పరమానందంలో ఆయన నర్తిస్తారు.
ఆ నాట్యం నుంచే రూప తరంగాలు ఉద్భవించాయి.
పరమానందంతో ఆయన నా మనసునూ
దేహాన్నీ స్పృశించినప్పుడు,
అవి నా స్వాధీనం తప్పుతాయి.
సమస్త సౌందర్యాల్లో - చైతన్యంలో - దుఃఖాల్లో
ఆనందాల్లో — అన్నింటిలో ఆయన లీనమై వున్నారు.
ఆయన ఆద్యంత రహితుడు.
సమస్తాన్ని ఆయన తన ఆనందంలో వుంచుకున్నారు.

*　　　*　　　*

# 27

గురు కటాక్షమే నాకు అవ్యక్తాన్ని వ్యక్తపరిచింది.
కాళ్ళు లేకుండా నడవడం, కళ్ళు లేకుండా చూడ్డం,
చెవులు లేకుండా వినడం, నోరు లేకుండా తాగడం,
రెక్కలు లేకుండా ఎగరడం నేను ఆయన్నించే
నేర్చుకున్నాను.

సూర్య చంద్రాదులు, రేబవళ్ళులేని ప్రదేశం వరకు
నా ప్రేమను, నా ధ్యానాన్ని విస్తరింప జేశాను.
తినకుండా అమృత మాధుర్యాన్ని చవిచూశాను.
నీరు తాగకుండా దప్పిక తీర్చుకున్నాను.
సంతోషానికి ప్రత్యుత్తరమున్నచోట,
సంపూర్ణమైన ఆనందం వుంటుంది.
ఆ ఆనందాన్ని ఎవరి ముందు విశదపరచను?

"గురువు వర్ణనాతీతుడు. అటువంటి గురువు
దొరికిన శిష్యుని అదృష్టం చాలా గొప్పది", అంటాడు కబీరు.

*　　*　　*

## 28

నిర్గుణం ముందు, సుగుణం నాట్యం చేస్తోంది.
నువ్వూ—నేనూ ఒకటేనని ఈ బాకా
బహిరంగ పరుస్తోంది.

గురువువచ్చి, శిష్యుని ముందు తలవంచుతాడు.
ఇది వింతల్లోకల్లా గొప్ప వింత.

*　　　　*　　　　*

## 29

ఓ కబీర్! నీకు ఎప్పటినుంచి వైరాగ్యం వచ్చింది?
ఏ చోట నీలో ప్రేమ భావం అంకురించింది?'' అని
గోరక్‌నాథ్ అడిగాడు.

దానికి కబీరు జవాబు చెప్పాడు :
ఆయన అనంతరూపాలు, ఆయన ఆటను
ఆరంభించ నప్పుడు,
''గురువు, శిష్యుడు'' అనే భావం లేనప్పుడు,
ప్రపంచం విస్తరించనప్పుడు,

పరబ్రహ్మ ఒక్కడే ఒంటరిగా వున్నప్పుడు,
అప్పుడే నేను సన్యాసినయ్యాను.
ఓ గోరక్! అప్పుడే నా ప్రేమ పరబ్రహ్మవైపు మళ్ళింది.

నేను యోగంలో ఉపదేశం పొందినప్పుడు—
బ్రహ్మ శిరస్సున కిరీటం ధరించలేదు.
విష్ణువు చక్రవర్తిగా పట్టాభిషిక్తుడు కాలేదు.
శివశక్తి ఇంకా ఉద్భవించలేదు,

నేను కాశీలో అకస్మాత్తుగా బైటపడ్డాను.
రామానందులు నన్ను ప్రకాశింపజేశారు.
అనంతుని దర్శనార్థం దాహంగొని వున్నాను.
ఆయన్ని దర్శించి, కలుసుకోవడానికే నేను కాశీ వచ్చాను,

నిరాడంబరేశ్వనిలో నేను నిరాడంబరంగా
ఐక్యం కాగలను.
నా ప్రేమ పెద్ద అలగా ఉప్పొంగుతుంది." అని
సమాధానమిచ్చి—
"ఓ గోరక్, నువ్వూ ఆయన సంగీతం వింటూ
ముందుకుసాగు", అంటాడు కబీరు.

* * *

# 30

ఈ చెట్టు మీద ఒక పక్షి వుంది,
జీవితానందంలో అది నాట్యం చేస్తోంది.
అది ఎక్కడ వుందో, దాని పాట పల్లవి ఏమిటో
ఎవరికి తెలుసు?

దట్టమైన చెట్ల కొమ్మల నీడల్లో దాని గూడు వుంది.
అది గూటికి సాయంత్రం వచ్చి,
ఉదయమే ఎగిరి పోతుంది.
దాని ఉద్దేశ్యం ఏమిటో అది ఒక్క మాటైనా చెప్పదు.

నాలో పాడే ఈ పక్షి గురించి నాకు ఎవరూ చెప్పలేదు
దానికి రంగులేదు. రంగు లేకపోనూ లేదు.
దానికి రూపురేఖలు లేవు.
అది ప్రేమ నీడలో కూర్చున్నది.

అనంతమూ, శాశ్వతమూ, పొంద శక్యమూకాని దాంట్లో,
అది నివసిస్తోంది.

అది ఎప్పుడు వచ్చి. ఎప్పుడు వెళ్ళిపోతుందో
ఎవరూ గుర్తుపట్టలేరు.

"ఓ సోదరా, ఈ మర్మమంతా అగాధం.
ఆ పక్షి ఎక్కడ విశ్రాంతిగా వుంటుందో
వివేకవంతుల్ని వెదికి తెలుసుకోనియ్యి",
అంటాడు కబీరు.

*　　*　　*

# 31

నిద్రపోనీకుండా, నన్నో పుండు రాత్రింబవళ్ళు
బాధిస్తోంది.
నా ప్రియుని కలుసుకోవడానికి,
నేను ఆరాటపడుతున్నాను.
నా పితృ గృహం నాకు ఇంక ఆనందాన్ని ఇవ్వదు.

ఆకాశ ద్వారాలు తెరచుకున్నాయి,
దేవాలయం బహిర్గతమైంది.
నేను నా నాథుణ్ణి కలుసుకున్నాను.
నా మనసునీ, శరీరాన్ని ఆయన పాదాల వద్ద
అర్పణగా వదిలేశాను.

* * *

# 32

హృదయమా, నాట్యం చెయ్యి. ఆనందంతో నృత్యం చెయ్యి!
ప్రేమ గీతాలు, రేబవళ్ళను సంతోషంతో నింపుతున్నాయి.
ఆ గాన మాధుర్యాన్ని ప్రపంచం వింటోంది.
ఆ సంగీత లయకు, జనన - మరణాలు
ఆనందోన్మత్తతతో నృత్యం చేస్తున్నాయి.

భూమి, పర్వతాలు, సముద్రాలు నాట్యం చేస్తున్నాయి.
ప్రాపంచిక మానవుడు నవ్వులతో, కన్నీళ్ళతో
నృత్యం చేస్తున్నాడు.

కాషాయ వస్త్రాలు ధరించి, దురహంకారంతో
ప్రపంచానికి దూరంగా వుంటావెందుకు ?
చూడు! నా హృదయం శతకళా స్వరూపానందంతో
నృత్యం చేస్తోంది.
సృష్టికర్త చాలా సంతోషిస్తున్నాడు.

* * *

# 33

ప్రేమ, హృదయాన్ని తాగుబోతుగా చేసినప్పుడు,
మాటల అవసరం ఏముంది ?
వజ్రాన్ని ఉత్తరీయంలో మూట కట్టాక,
దాన్ని మాటి మాటికీ విప్పి చూడ్డమెందుకు?
బరువు తక్కువగావున్న సిబ్బె, పైకి లేస్తుంది.
బరువు సమానంగా వుంటే,
తూయడమెందుకు ?

పర్వతాల వెనకనున్న సరస్సు దగ్గరకు
ఎగిరి వెళ్ళిన హంస, అది ఇంకా ఎందుకు
గుంటల్ని, మడుగుల్ని వెతుక్కుంటుంది ?

ప్రభువు నీలో వుండగా, ఆయన దర్శనం కోసం
నువ్వు కళ్ళు తెరచి వుంచవలసిన పనేముంది?
"ఓ సోదర సాధూ, విను ;
నా కళ్ళకు అత్యానందం కలిగించే నా ప్రభువు,
నాతో ఏకమయ్యారు", అంటాడు కబీరు.

*　　　*　　　*

# 34

మన ఇద్దరి మధ్య వున్న ప్రేమబంధం,
ఎట్లా తెగిపోతుంది?
నీటి మీద తామరాకు వున్నట్లు, ప్రభువైన నీమీద
సేవకుడనైన నేను ఆధారపడి వున్నాను.
చకోరం రాత్రంతా చంద్రుని వంక
రెప్పవేయకుండా చూసినట్లు,
నా ప్రభువైన నీ కోసం, నేను నిరీక్షిస్తున్నాను.

ఆద్యంతమూ మన ఇద్దరి మధ్యావున్నా ప్రేమ,
ఎట్లా నశిస్తుంది?
"నది సాగర గర్భం చేరునట్లు, నా హృదయం
నిన్ను స్పృశిస్తుంది", అంటాడు కబీరు.

*　　　*　　　*

# 35

నా హృదయం, మనసు నీమీద వాంఛతో
దుఃఖిస్తున్నాయి.
ఓ నా ప్రియతమా, నువ్వు నా గృహానికి విచ్చేయి.
నీ హృదయాన్ని నా హృదయం స్పృశించక
పోయినా, నేను నీ వధువునని
ప్రజలు చెప్పుకుంటూవుంటే, నేను సిగ్గు పడతాను.
అయితే ఈ నా ప్రేమ ఏమిటి ?
నాకు తిండి సహించడం లేదు. నిద్ర పట్టడం లేదు.
నా హృదయం ఎప్పుడూ ఇంటా - బైటా
అశాంతిగా కొట్టుకుంటోంది.

దాహం గొన్న వానికి నీరు వుంది.
వధువుకి వరుడు వున్నాడు.
నా సందేశాలు నా ప్రియునికి అందజేయడానికి
నాకు ఎవరున్నారు ?
ప్రభువు దర్శనం కోసం కబీరు అశాంతిగా వున్నాడు.

*　　　*　　　*

## 36

ఓ వనితా, మేల్కో,
ఇంక నిద్ర పోకు.
రాత్రంతా గడిచిపోయింది.
పగటి వేళను కూడా పోగొట్టుకుంటావా?
మేలొన్నవాళ్ళు, ఆభరణాల్ని అందుకున్నారు.
ఓ బుద్ధిలేని వనితా, నువ్వు నిద్రపోతూ
అంతా పోగొట్టుకున్నావు.
ఓ అబలా, నీ ప్రియుడు చతురుడు.
నువ్వు మందమతివి.

నువ్వు ఎప్పుడూ నీ నాథునికోసం,
నీ శయ్య సిద్ధం చేయలేదు.

ఓ ఉన్మత్తురాలా,
నీ కాలమంతా చిలిపి ఆటలతో గడిపావు.
నువ్వు నీ ప్రియుణ్ణి ఎరుగవు గనుక,
నీ యవ్వనమంతా వృథాగా గడిచిపోయింది.
లే, మేల్కో!
చూడు, నీ శయ్య శూన్యంగా వుంది.
ఆయన నిన్ను రాత్రే వదలి వెళ్ళిపోయారు.

"ఎవరి హృదయంలో ఆయన సంగీత శరం
దూసుకుపోతుందో, ఆమె మాత్రమే
నిద్ర మేల్కొంటుంది," అంటాడు కబీరు.

* * *

## 37

సూర్యుడు ప్రకాశిస్తూవుంటే, చీకటి ఎక్కడవుంది?
అది రాత్రే అయితే, సూర్యుడు తన కిరణాల్ని
వెనక్కి తీసుకుని వుండేవాడు.
జ్ఞానం వుంటే, అజ్ఞానం నిలవగలదా?
అజ్ఞానం వుంటే, జ్ఞానం చనిపోవాలి.
కామం వుంటే, ఇంక ప్రేమ ఎలా వుంటుంది?
ప్రేమ వున్నచోట, కామానికి తావులేదు.

ఖడ్గం ధరించి, పోరాటంలో చేరు.
ఓ నా సోదరా, జీవితాంతం పోరాడు.
శత్రు శిరచ్ఛేదం త్వరగా కావించి,
శత్రుత్వాన్ని అంత మొందించి,
ప్రభువు దర్బారు చేరి, తలవంచు.

ధైర్యవంతుడు పోరాటాన్ని వదలడు.
పోరాటంనుంచి పారిపోయిన వాడు,
నిజమైన యోధుడు కాదు.

ఈ దేహమనే యుద్ధ భూమిలో,
"మోహం - కోపం - ఆశ - అహం" అనే వాటికి
వ్యతిరేకంగా, గొప్ప పోరాటం జరుగుతుంది.
సత్యం - సంతృప్తి - నిర్మలత్వం నిలయమై వున్న
సామ్రాజ్యంలో, ఆ పోరాటం
మరీ తీవ్రరూపం దాలుస్తుంది.

గట్టిగా మోగిన ఖడ్గమే, ప్రభువు నామం.
శౌర్యవంతుడైన యోధుడు
రణరంగం ప్రవేశించినప్పుడు,
పిరికిపందల గుంపు పరుగు తీస్తుంది.

సత్యాన్వేషణకై నా సమరం, కష్టభూయిష్టమైనది.
వీరుని ప్రతిజ్ఞకంటె,
మరణించిన భర్తను అనుసరించే సతి దీక్షకంటే,
సత్యాన్వేషకుని ప్రతిజ్ఞ ప్రయాసకరమైనది.
వీరుని పోరాటం, కొన్ని గంటల్లో,
వితంతువు మరణవేదన కొన్ని ఘడియల్లో
అంతమౌతుంది.
కాని, సత్యాన్వేషకుని సమరం
రాత్రింబవళ్ళు - ఎప్పటికీ అంతం కాకుండా
జీవితాంతం సాగుతుంది," అంటాడు కబీరు.

*  *  *

# 38

"భ్రమ" అనే తాళంకప్ప, ద్వారాన్ని మూసింది.
"ప్రేమ" అనే తాళం చెవితో, ఆ ద్వారాన్ని తెరు.

ద్వారం తెరచి, ప్రియుని మేల్కొల్పు.

"ఓ సోదర సాధూ, అటువంటి సదవకాశాన్ని
దాటిపోనీయకు," అంటాడు కబీరు.

* * *

# 39

ఓ సాధూ, ఈ తనువు ఆయన తంబూర.

ఆయన దాని తీగల్ని బిగించి, శృతిపెట్టి,
దాన్నించి బ్రహ్మనాదాన్ని పలికిస్తారు.

తంతులు తెగినా, బిరడాలు ఒదులైనా
ధూళి భూయిష్టమైన తంబూర,
తిరిగి మట్టిలో కలిసిపోవలసిందే!

"మహేశ్వరుడు మినహా మరెవ్వరూ
దాన్నించి మధురస్వరాల్ని పలికించలేరు,"
అంటాడు కబీరు.

* * *

# 40

సదా సంచారినైన నన్ను తిరిగి ఇంటికి రమ్మని
పిలిచిన వాడే, నిశ్చయంగా నాకు ప్రియమైనవాడు.

ఇంట్లోనే నిజమైన యోగం, జీవనభోగం వున్నాయి.
ఇల్లు విడిచి నేనెందుకు అడవుల్లో తిరగాలి?

ఆత్మ సాక్షాత్కారం విషయంలో నాకు పరమేశ్వరుడు
సహాయ పడేటట్లయితే,

ఇంట్లోనే బంధాలూ - బంధ విముక్తీ వున్నాయని తెలుసుకోగలను.
పరమేశ్వర చింతనలో
లోతుగా మునిగే శక్తి ఎవరికి వుంటుందో,
ఎవరి మనసు సదా పరమేశ్వర ధ్యానంలో
సులభంగా లీన మౌతుందో, ఆయన నాకు ప్రియమైనవాడు.

పరమేశ్వరుని తెలుసుకుని, ఆయన పరమ సత్యంలో
ఎవరు ధ్యాన నిమగ్నులై జీవిస్తారో;
జీవితంలో - ప్రేమ - వైరాగ్యాల్ని కలిపి
ఎవరు దివ్యనాదాల్ని పలికిస్తారో,
వారు నాకు ప్రియమైనవారు.

గృహమే శాశ్వతమైన స్థలం.
ఇంట్లోనే సత్యం వుంది.

సత్య స్వరూపుడైన ఆయన్ని పొందడానికీ,
ఇల్లు సహాయ పడుతుంది.
కాబట్టి, నువ్వు వున్నచోటనే వుండు.
సకాలంలో సమస్తం నీ దగ్గరకే వస్తాయి," అంటాడు కబీరు.

*　　　*　　　*

# 41

ఓ సాధూ, సహజ సమాధి సర్వోత్కృష్టం.
నేను ప్రభువును కలుసుకున్ననాటినుంచీ,
మా ప్రేమ నిర్విఘ్నంగా సాగుతోంది.

నేను కళ్ళు - చెవులు మూసుకోను.
దేహాన్ని శుష్కింప చేసుకోను.
కళ్ళు తెరచి, సర్వత్రా ఆయన సౌందర్యాన్ని
చిరునవ్వుతో తిలకిస్తాను.
ఆయన నామాన్ని ఉచ్చరిస్తాను.
నేను దేన్ని చూసినా, అది ఆయన్నే జ్ఞాపకం చేస్తుంది.

నేను ఏం చేసినా, అది ఆయన ఆరాధన అవుతుంది.
ఉదయాస్తమయాలు రెండూ, ఒకటే, నాకు.
నాలో వైరుధ్యాలన్నీ పరిష్కారమయ్యాయి.

నేను ఎక్కడికి వెళ్ళినా, ఆయన చుట్టూ ప్రదక్షిణ చేస్తాను.
నేను సాధించిందంతా, ఆయన సేవ.

నేను పడుకున్నప్పుడు, ఆయన పాదాల వద్ద
సాష్టాంగపడి వుంటాను.
ఆయన ఒక్కడే నాకు ఆరాధ్య దైవం.
నాకు ఇంకెవరూ లేరు.

నా నోరు అవాచకాల్ని పలకడం మానేసి,
రాత్రింబవళ్ళు ఆయన మహిమను కీర్తిస్తోంది.

ఆయన అమర గానం, నా చెవుల్లో మారు మోగుతూ
వుంటుంది గనుక; నేను లేచినా - కూర్చున్నా
ఎప్పుడూ ఆయన్ని విస్మరించను.

"నా హృదయం ఆవేశంతో నిండివుంది.
నిగూఢమైన దాన్ని ఆత్మలో దర్శించాను.
సుఖ - దుఃఖాలను మించిన బ్రహ్మానందంలో
మునిగివున్నాను," అంటాడు కబీరు.

* * *

## 42

పుణ్యతీర్థాల్లో వున్నదీ నీరే!
అక్కడ మరేం విశేషం లేదు.
నేను వాటిల్లో స్నానం చేశాను కనుక,
వాటి సంగతి నాకు తెలుసు.

విగ్రహాలు నిర్జీవాలు.
అవి మాట్లాడలేవు. వాటి గురించి గట్టిగా
అరిచాను గనుక, వాటి సంగతీ నాకు తెలుసు.
తెరఎత్తి చూశాను కనుక,
పురాణాలు - ఖురాన్ వట్టి మాటలనీ తెలుసు.

ఇతర విషయాలన్నీ అసత్యమన్న సంగతి
తనకు బాగా తెలుసునని
కబీరు తన అభిప్రాయాన్ని చెపుతున్నాడు.

* * *

# 43

నీటిలో చేప దాహంతో వుందని విన్నప్పుడు
నవ్వు వస్తుంది.
నీ ఇంట్లోవున్న సత్యాన్ని చూడక,
నువ్వు అవిరామంగా అడవుల్లో తిరుగుతావు.

సత్యం ఇక్కడే వుంది.
కాశీ - మధుర నీ ఇష్టం వచ్చిన చోటుకు వెళ్ళు.
నువ్వు ఆత్మను దర్శించకపోతే,
ఈ ప్రపంచం నీకు అసత్యమైనదిగా తోస్తుంది.

* * *

## 44

మరుగుపడిన పతాకం, గగన మందిరంలో
ప్రతిష్ఠింపబడివుంది.
రేరాజుతో - మిలమిలామెరిసే నక్షత్రాలతో
నీలిచాందిని పరచబడివుంది.

రవి - చంద్రుల తేజను, ప్రకాశిస్తుంపక్కడ.
ఆ తేజస్సులో నీ మనస్సును మౌనంగా నిలుపు.

"ఈ అమృతాన్ని తాగినవాడు,
ఉన్మత్తునివలె విహరిస్తాడు," అంటాడు కబీరు.

* * *

## 45

ఓ సాధూ, నువ్వెవరు?
ఎక్కడ నుంచి వచ్చావు?
పరబ్రహ్మ ఎక్కడ వున్నాడు?
సృష్టి సమస్తంతో ఆయన ఎట్లా క్రీడిస్తున్నాడు?

కట్టెలో నిప్పు వుంది.
కాని, దాన్ని అకస్మాత్తుగా ఎవరు రగుల్గొల్పుతారు?

కాలిన కట్టె బూడిదగా మారిన తర్వాత,
జ్వలించే ఆ శక్తి ఎక్కడికి పోతుంది?
"ఆయన అంతులేనివాడనీ, అనంతుడు కాదనీ
నిజమైన గురువు బోధిస్తాడు.
పరమేశ్వరుడు, తనను వినేవాళ్ళకు తన భాష
అర్థమయ్యేట్లు పలుస్తాడు," అంటాడు కబీరు.

* * *

## 46

ఓ సాధూ, నీ దేహాన్ని సాధారణ మార్గంలోనే
పవిత్రం చేసుకో!
వట వృక్షంలో, విత్తనం వుంది. ఆ విత్తనంలో
ఫల - పుష్ప - ఛాయలు వున్నాయి.
నీ దేహంలో, బిందువు వుంది.
ఆ బిందువులో, దేహం వుంది.
పంచభూతాల్ని ఆయన్నించి వేరుగా పొందలేవు.
ఓ ఖాజీ, ఓ పండిట్; దాన్ని బాగా యోచించండి.
ఆత్మలో లేనిది, ఏముంది?
నీళ్ళతో నిండిన కుండ, నీళ్ళపైన వుంది.
కుండలోపలా - బైటా నీరు వుంది.
ఆ నీటికి ఏ పేరూ పెట్టకు.
పేరు పెడితే, దానికి ద్వైత దోషం వస్తుంది.

"సత్య నామమే, నిజమైన నీ తత్వం. దాన్ని విను.
నీలో వున్న ఆయనే, ఆ సత్యనామాన్ని ఉచ్చరిస్తారు.
ఆయనే సృష్టికర్త," అంటాడు కబీరు.

*      *      *

## 47

వేరు లేకుండా నిలబడి, పువ్వులు పూయకుండా
కాయలుకాసే ఒక వింత వృక్షం వుంది,
దానికి కొమ్మలు, ఆకులు లేవు. అదే తామర పువ్వు.

రెండు పక్షులు పాడుతున్నాయి.
ఒకటి గురువు, రెండోది శిష్యుడు.
అనేక రకాల జీవన ఫలాలను
ఏరుకుని తింటున్నాడు, శిష్యుడు.
అతన్ని ఆనందంతో తిలకిస్తున్నాడు, గురువు.

పక్షి చాలా స్పష్టంగా కనిపిస్తున్నా
అన్వేషణకు అసాధ్యంగా వుంది.
రూపరహితమైనది, అన్ని రూపాల్లోవుంది.
నేను ఆ రూపాల ఔన్నత్యాన్ని కీర్తిస్తున్నాను.
కబీరు ఏం చెపుతున్నాడో అర్థం చేసుకోవడం కష్టం.

*      *      *

# 48

అశాంతితో అల్లల్లాడే నా మనసును నిశ్చలం చేశాను.
నా ఆత్మ దేదీప్యమానంగా ప్రకాశిస్తోంది.
అందులో, దాన్ని మించిన దాన్ని దర్శించాను.
దాని సహవాసంలో మిత్రుడైన ఆయన్ని చూశాను.
బంధీనై కూడా, నన్ను నేను విముక్తి పరచుకున్నాను.
సమస్త సంకుచితాల సంకెళ్ళను ఛేదించి,
బైట పడ్డాను.

"అసాధ్యం అయిన దాన్ని సాధించాను.
నా హృదయం ప్రేమ వర్ణంతో నిండి వుంది,"
అంటాడు కబీరు.

* * *

# 49

నువ్వు చూస్తున్నదేదో అది, అది కాదు.
అసలు వున్నదాన్ని వర్ణించడానికి మాటలులేవు.
చూడకపోతే, నువ్వు నమ్మవు.
నీకేం చెప్పినా వినవు, అంగీకరించవు.
వివేకి మాట మాత్రం చేత, తెలుసుకుంటాడు.
అవివేకి, నోరు తెరచుకుని నిలబడతాడు.

కొందరు నిరాకారుని ధ్యానిస్తారు.
కొందరు సాకారుని ధ్యానిస్తారు.
కాని, పరమేశ్వరుడు ద్వంద్వాతీతుడని
వివేకి తెలుసుకుంటాడు.

ఆయన సౌందర్యం కంటికి కనుపించేదికాదు.
ఆయన సంగీతం చెవికి వినిపించేది కాదు.

"ప్రేమ - వైరాగ్యాలను తెలుసుకున్నవాడే,
జీవన్ముక్తుడు," అంటాడు కబీరు.

* * *

## 50

ప్రభువు పిల్లంగోవి అవిరామంగా మోగుతోంది.

ఆ మురళీ రవమే, ప్రేమ.
ఆ ప్రేమ - అన్ని హద్దుల్ని అధిగమించినప్పుడే,
సత్యాన్ని చేరుకుంటుంది.
ఆ నాదం ఎంత విస్తరిస్తోందో! దానికి అంతం లేదు.
దానికి ఎదురుగా ఏదీ నిలవలేదు.
ఆ స్వర స్వరూపం, శతకోటి
భానుద్యుతి మాదిరిగా వుంది.
సత్య స్వరాల వీణ, అనమానంగా ధ్వనిస్తోంది.

* * *

# 51

ప్రియ మిత్రమా, ప్రియుని సమాగమం కోసం
నేను ఆరాట పడుతున్నాను.
నా యౌవనం పుష్పించింది.
ఆయన్నించి వియోగబాధ.
నా గుండెల్ని చెదర గొడుతోంది.

విజ్ఞానపు ఇరుకు వీధుల్లో,
నేను ఇంకా నిష్కారణంగా విహరిస్తున్నాను.
కాని, ఆయన సంకేతాల్ని
ఆ విజ్ఞానపు ఇరుకు వీధుల్లోనే నేను గమనించాను.

నా ప్రియుని నుంచి నాకో ప్రేమలేఖ వచ్చింది.
అందు వర్ణనాతీతమైన సమాచారం వుంది.
ఇప్పుడు నాకు మృత్యుభీతి పోయింది.

"ఓ నా ప్రియమిత్రమా,
బహుమానంగా నేను మృత్యుంజయుని పొందాను,"
అంటాడు కబీరు.

*　　　*　　　*

## 52

ప్రియుని ఎడబాసినప్పుడు,
నా హృదయం వ్యథతో నిండిపోయింది.
పగలు సుఖం లేదు, రాత్రి నిద్రలేదు.
నా దుఃఖాన్ని ఎవరికి చెప్పుకోను?

రాత్రి, అంధకారంగా వుంది.
కాల హరణ మౌతోంది.
ప్రభువు లేకపోవడం వల్ల,
నేను భయంతో వణకుతున్నాను.

"నా ప్రియ మిత్రమా, విను:
ప్రభువు సమాగమంతో తప్ప, నాకు తృప్తిలేదు,"
అంటాడు కబీరు.

* * *

## 53

నన్ను ఆనంద పరవశుణ్ణిచేసే, ఆ మురళీరవం ఏమిటి?
దీపరహితంగా, కాంతి విరజిమ్ముతోంది.
మూలం రహితంగా, పద్మం వికసిస్తోంది.
పువ్వులు గుత్తులు - గుత్తులుగా విచ్చుకుంటున్నాయి.

చంద్ర దర్శనం కోసం, చకోరం
చాలా పట్టుదలతో వుంది.
చాతక పక్షి, వానజల్లు కోసం
హృదయమంతటితో గట్టి ఆశతో వుంది.
కాని, ఎవరి ప్రేమమీద ప్రియురాలు
తన జీవితమంతా కేంద్రీకరిస్తున్నది?

* * *

# 54

అనాహత సంగీత స్వరాన్ని నువ్వు వినలేదా?
గది మధ్య ఆనంద విపంచి మృదుమధురంగా
నినదిస్తోంది. దాన్ని వినడానికి బైటికి ఎందుకు వెళ్ళాలి?

మాలిన్యాలన్నింటినీ మరకైనా లేకుండా కడిగేసుకున్నా,
ఆ పరమేశ్వరుని ప్రేమామృతాన్ని
ఆస్వాదించకపోతే, లాభమేమిటి?

ఖాజి, ఖురాన్‌లోని సూక్తుల్ని వెదకి,
ఇతరులకు బోధించి, ఆదేశిస్తాడు.
కాని, ఆయన హృదయం ప్రేమలో మునిగి
తాండవమాడకపోతే, ఆయన ప్రవక్త అయినా—
ఆ బోధ ఏం ఉపయోగం?

యోగి, తన వస్త్రాలకు ఎరుపు రంగు అద్దుతాడు.
అతనికి ప్రేమస్వరూపమేమిటో తెలియకపోతే,
బట్టలకు రంగు అద్దడం వల్ల ప్రయోజనం ఏముంటుంది?

"నేను దేవాలయంలో వున్నా, సౌధాగ్రాన వున్నా,
తోటలో వున్నా, ఎక్కడ వున్నా
ప్రతిక్షణం ప్రభువు నాలో తన ఆనందాన్ని
అనుభవిస్తున్నారని నేను నీకు నిశ్చయంగా
చెప్పగలను," అంటాడు కబీరు.

*　　　*　　　*

# 55

సూక్ష్మమైనది ప్రేమ మార్గం.
అందు అర్థించడం - అర్థించకపోవడం అనే ప్రసక్తి
లేదు.

ఆయన పాదాల ముందు అందరూ తమ, తమ
వ్యక్తిత్వాల అర్పించుకుంటారు.

నీటిలో చేప మాదిరిగా, ప్రేమ లోతుల్లో ప్రతివాడూ
ఆనందాన్వేషణలో మునిగివుంటాడు.

ప్రభువు సేవకోసం, ప్రేమికుడెపుడూ,
తన శిరస్సు అర్పించడానికి ఆలస్యం చేయడు.
ఈ ప్రేమ రహస్యాన్ని కబీరు వెల్లడిస్తున్నాడు.

*　　　*　　　*

# 56

నిరాకారుని ఆకారాన్ని నా కంటికి ఎవరు చూపిస్తారో,
ప్రభును పొందడానికి సదాచార కర్మల కన్నా
సహజ మార్గాన్ని నాకు ఎవరు బోధిస్తారో,
ద్వారాల్ని బంధించకుండా, కఠోర ప్రాణాయామం
చేయకుండా, ప్రపంచాన్ని పరిత్యజించకుండా
నాకు ఎవరు సాయపడతారో
మనసు దేంట్లో లగ్నమైనప్పటికీ
పరమాత్మను తెలుసుకునేందుకు
నాకు ఎవరు దారి చూపుతారో,
సర్వ కర్మల్లో మనసు నిశ్చలంగా వుంచమని
నాకు ఎవరు ఉపదేశిస్తారో—
వారే నా గురువు.
మనసులో లేశ మాత్రం భయంలేకుండా,
నిరంతరం ఆయన ఆనందంలో ఓలలాడుతూ వుంటారు.

సర్వభోగాల మధ్య వుండి కూడా
ప్రభువు సమాగమనోత్సాహాన్ని నిలుపుకుంటారాయన.
నేలమీద - నీటిమీద - గాలిలో - ఆకాశంలో
అంతటా ఆ పరమేశ్వరుని అనంత ఆసనం వుంది.

అన్వేషకుని ఆసనం, ఆకాశంలో పిడుగువలె దృఢంగా వుంది.

అంతర్యంలో వున్నవారే, బైటా వున్నారు.
ఆయన్ని తప్ప వేరెవరినీ దర్శించను.

* * *

## 57

ఏ శబ్దం నుంచి ఈ బ్రహ్మాండమంతా
ఉద్భవించిందో, ఆ శబ్దాన్ని గ్రహించు.
ఆ శబ్దమే, గురువు.
నేను ఆ శబ్దాన్ని విని, దాని శిష్యుణ్ణి అయ్యాను.
ఆ శబ్దార్థం తెలిసిన వారు ఎందరున్నారు?

ఓ సాధూ, ఆ శబ్దాన్ని సాధన చెయ్యి.
వేదాలు - పురాణాలు - దాన్ని వివరించాయి,
దాంట్లోనే ప్రపంచం స్థాపించబడివుంది.
రుషులు - భక్తులు - దాని గురించి వచిస్తారు,
కాని, దాని మర్మం ఎవరికీ తెలియదు.

గృహస్థు, దాన్ని విని, ఇంటిని పరిత్యజిస్తాడు.
దాన్ని విని, సన్యాసి ప్రేమాభిముఖుడౌతాడు.
షడ్దర్శనాలు దాన్ని విశద పరుస్తాయి.
పరిత్యాగోత్సాహం ఆ శబ్దార్థాన్ని వ్యక్త పరుస్తుంది.
ఆ శబ్దం నుంచే, ప్రపంచ స్వరూపం ఆవిర్భవించింది.
ఆ శబ్దమే, సమస్తాన్ని వెల్లడించింది.

"కాని, ఆ శబ్దం ఎక్కడ నుంచి పుడుతుందో
ఎవరికి తెలుసు?" అంటాడు కబీరు.

*　　　*　　　*

# 58

మధు పాత్ర ఖాళీ చేసి, తాగిన మత్తులో వుండు.
ఆయన దివ్యనామామృతాన్ని తాగు.

"ప్రియమైన సాధూ, నా మాట విను:
ఈ మనసు, ఆపాద మస్తకం విషపూరితం,"
అంటాడు కబీరు.

*　　　*　　　*

# 59

ఓ మానవుడా, ప్రభువును తెలుసుకొనకపోతే,
నువ్వు గర్వపడటానికి ఏముంది?
నీ తెలివితేటల్ని దూరంగా పెట్టు.
శుష్కవేదాంతం నిన్ను ఎప్పటికీ ఆయనలో ఐక్యం చేయలేదు.
లిఖిత గ్రంథాల సాక్ష్యంతో, ఆత్మవంచన చేసుకోకు.
సర్వాతీతమైనది, ప్రేమ.
దాన్ని నిజంగా అన్వేషించినవాడు,
దాన్ని తప్పక తెలుసుకుంటాడు.

*　　　*　　　*

# 60

జీవనామృత సాగర సంచారాభిలాష,
నన్ను వాంఛా విముఖుణ్ణి చేసింది.

విత్తనంలో వృక్షమున్నట్లు,
సమస్త దరిద్రాలు, వాంఛలో వున్నాయి.

*　　*　　*

# 61

చిట్ట చివరికి సుఖ సాగరం చేరుకుని,
దాహంతో తిరిగి వెనక్కి వెళ్ళకు.
బుద్ధిహీనుడా, మేల్కొ!
మృత్యువు గర్వంగా పదఘట్టన చేస్తో,
నీ మీదికి దూకుతోంది.
నీ ముందు పవిత్రోదకం వుంది.
నిరంతరం దాన్ని సేవించు.

ఎండమావుల్ని అనుసరించి నడవకు.
అమృతంకోసం దాహంగొని వుండు.
ధృవుడు - ప్రహ్లాదుడు - శుకదేవుడు - రాయదాస్
దాని రుచి చూశారు.

మహర్షులు, ప్రేమ మత్తులో వున్నారు.
వారి దప్పిక, ప్రేమకోసం.

"ఓ సోదరా, నా మాట విను:
భయమనే గూడు కూలిపోయింది.
ప్రపంచంతో కనీసం ఒక్క క్షణమైనా
నువ్వు ముఖాముఖిగా వుండలేదు.
నీ అసత్యపు బంధాల్ని నువ్వే అందంగా అల్లుకున్నావు.
నీ మాటలన్నీ వంచనతో కూడివున్నాయి.
వాంఛా భారాన్ని శిరస్సున ధరిస్తే,
నువ్వు ఎట్లా తేలికగా వుండగలవు?" అంటాడు కబీరు.

"సత్యాన్ని, వైరాగ్యాన్ని, ప్రేమని
నీలో నిలుపుకో" అంటాడు కబీరు.

* * *

# 62

మరణించిన తన పతి చితమీద
కాలిపోమ్మని, సతికి ఎవరు - ఎప్పుడు బోధించారు?
సర్వసంగ పరిత్యాగంలో ఆనందాన్ని పొందమని
ప్రేమకు ఎవరు బోధించారు.

* * *

## 63

ఓ మనసా, ఎందుకు అంత ఆరాటపడతావు?
మృగాల్ని - పక్షుల్ని - కీటకాల్ని
ఎవరు జాగ్రత్తగా కాపాడుతున్నారో—
నువ్వు ఇంకా నీ తల్లి గర్భంలో వుండగా
నీ జాగ్రత్త ఎవరు తీసుకున్నారో—
వారు ఇప్పుడు నీ జాగ్రత్త తీసుకోరా?

ఓ మనసా, నీ ప్రభువు చిరునవ్వు నుంచి
నువ్వు ఎట్లా దూరంగా పోగలవు?
అసలు ఆయన్ని వదలి నువ్వు ఎట్లా దూరాన
తిరుగుతున్నావు?

నువ్వు నీ ప్రియుణ్ణి వదలి,
అన్యుల గురించి ఆలోచిస్తున్నావు.
అందుకే నీ పనులన్నీ వ్యర్థం అవుతున్నాయి.

* * *

## 64

ప్రభువును కలుసుకోవడం, దుర్లభం.
చాతకపక్షి వర్షంకోసం రోధిస్తో, దాహంతో
చనిపోవడానికైనా సిద్ధపడుతుందిగాని;
వర్షపునీటిని తప్ప మామూలు నీటిని మాత్రం తాగదు.

సంగీతాభిలాషతో లేడి, ముందుకుపోయి
స్వర మాధుర్యం గ్రోలుతూ, మరణించడానికైనా
సిద్ధపడుతుందిగాని, భీరుపై తిరోగమించదు.

చితిమీద కాలుతున్న తన పతి శవం పక్కన
కూర్చుని, సతి అగ్నికి ఆహుతి అవుతుందిగాని,
అగ్నికి భయపడదు.
అమాయకమైన ఈ దేహం కోసం,
సమస్త భయాల్ని దూరంగా పెట్టు.

*    *    *

## 65

ఓ సోదరా, నేను మాయలోపడి కొట్టుకుపోతున్నప్పుడు,
నా నిజమైన గురువు నాకు దారి చూపించారు.
ఆనాటినుంచి నేను సాంప్రదాయాల్ని,
సదాచార కర్మల్ని వర్జించాను.
పుణ్యతీర్థాల్లో స్నానం చేయడం మానేశాను.
నేను ఒక్కణ్ణే పిచ్చివాణ్ణనీ,
నా చుట్టూ వున్న వాళ్ళంతా తెలివైన వాళ్ళనీ,
ఇన్నేళ్ళు ఈ బుద్ధిమంతుల్ని కలవరపరిచాననీ
నేను ఇప్పుడు గ్రహించాను.

ఆనాటినుంచి అతి వినయంగా ధూళిలో
ఎట్లా పొర్లాడాలో, నాకు తెలియకుండా పోయింది.

ఆ తర్వాత గుడిగంటల్ని మోగించలేదు.
పూజా పీఠాలమీద విగ్రహాల్ని ప్రతిష్ఠించలేదు.
విగ్రహాలను పూలతో ఆరాధించనూలేదు.

ప్రభువును సంతోషపరచడానికై
శరీరాన్ని శుష్కింపజేసే కఠోర సాధనలు
ఏవీ గొప్పవి కావు!
వస్త్ర విసర్జన చేసినా, ఇంద్రియాల్ని చంపినా
నువ్వు నీ ప్రభువును సంతోషపరచలేవు.

ఎవరు దయాపరులో, ఎవరు ధర్మాచరణపరులో,
ప్రపంచ విషయాల మధ్య వుండి కూడా
ఎవరైతే ఏదీ పట్టించుకోకుండా వుంటారో,
భూమిమీద సమస్త జీవకోటిని
తమవలె ఎవరు భావిస్తారో,
వారికే పరమేశ్వర దర్శన భాగ్యం కలుగుతుంది.
నిజమైన గురువు ఎప్పుడూ వానితోనే వుంటాడు.

ఎవరి వాక్కులు పవిత్రమో,
దురహంకారంనుంచీ, గర్వంనుంచీ ఎవరు దూరంగా
వుంటారో, ఎవరు స్వేచ్ఛాపరులో
వారే ఆ సత్యనామాన్ని పొందగలరు," అంటాడు కబీరు.

* * *

# 66

మనసుకు ప్రేమ - వర్ణం వేయడానికి బదులు,
బట్టలకు కాషాయం రంగు అద్దుతాడు, యోగి.
అతడు దేవాలయానికి వెళ్ళి, అందు కూర్చుని,
పరబ్రహ్మను వదలి, రాతిని ఆరాధిస్తాడు.
అతడు చెవులు చిల్లులు పొడుచుకుంటాడు.
జుట్టు, గెడ్డం జడలు కట్టుకుపోయేలా పెంచుతాడు.
చూడ్డానికి మేకపోతులా వుంటాడు.
మనోభీష్టాలన్నింటినీ చంపుకుని,
అరణ్యాల్ని ఆశ్రయించి, చివరికి
నపుంసకుడుగా మారిపోతాడు.
శిరోముండనం గావించి, బట్టలకు రంగు అద్ది,
గీత చదివి, గొప్ప వక్త అవుతాడు.

కాళ్ళూ - చేతులూ కట్టుబడిన నువ్వు,
మృత్యు ద్వారం దగ్గరకు వెడుతున్నావు," అంటాడు కబీరు.

* * *

# 67

నా దైవం ఎటువంటివాడో నాకు తెలియదు.
ఆయనకోసం ముల్లా గట్టిగా అరుస్తాడు, ఎందుకు?
నీ ప్రభువు బధిరుడా?

కదులుతున్న కీటకం కాళ్ళమీది
అతి సూక్ష్మమైన అందెల చప్పుడుకూడా
ఆయనకు అతి స్పష్టంగా వినిపిస్తుంది.

"జపమాల తిప్పు.
నీ ఆరాధ్యదైవ చిహ్నాన్ని నుదుట ధరించు.
జుట్టంతా ఆర్భాటంగా జడలు కట్టుకు పోనియ్యి.
కాని, నీ హృదయంలో ఒక మారణాయుధం వుండగా,
నువ్వు ఎట్లా ఈశ్వరుణ్ణి పొందుతావు?" అంటాడు కబీరు.

* * *

## 68

మధురమైన ఆయన వేణునాదం విన్నాను.
నేనింక నిలవలేను.
వసంతం కాకపోయినా, పువ్వు విచ్చుకుంది.
తుమ్మెద అప్పుడే దాని ఆహ్వానాన్ని అందుకుంది.
మెరపులతో ఆకాశం గర్జిస్తోంది.
నా హృదయం ఉప్పొంగుతోంది.
వర్షం పడుతోంది.
ప్రభువు దర్శనంకోసం నా హృదయం తపిస్తోంది.
ప్రపంచలయ అతిశయిస్తో, అణగారుతో వుండే
చోటుకు, నా హృదయం చేరింది.

అక్కడ మరుగుపడిన పతాకాలు,
గాలిలో రెపరెపలాడుతున్నాయి.
"నా హృదయం సజీవంగా వున్నప్పటికీ,
మరణవేదన పడుతోంది," అంటాడు కబీరు.

* * *

# 69

అల్లా మశీదులోనే వుంటే, మిగిలిన ఈ ప్రపంచం
ఎవరికి చెందినట్లు?
నీ తీర్థ యాత్రలో కనుపించిన విగ్రహాల్లోనే
రాముడుఉంటే, విగ్రహం లేనిచోట
ఏం జరుగుతున్నదీ తెలుసుకునేందుకు ఎవరున్నారు?
హరి తూర్పున - అల్లా పడమట వున్నారు.
హృదయంలోకి చూసుకుంటే,
రామ్ - రహీమ్ ఇద్దర్నీ దర్శించగలరు.
ప్రపంచంలోని స్త్రీ - పురుషులంతా,
ఆయన సజీవ స్వరూపాలు.
రామ్ - రహీమ్‌ల బిడ్డ, కబీర్.
ఆయనే నా ఫకీరు. ఆయనే నా గురుదేవులు.

* * *

## 70

ఎవరు సాధు స్వభావులో,
ఎవరు సంతృప్తి పరులో,
ఎవరు సమదృష్టి కలవారో,
ఎవరి మనస్సులు శాంతంగా - అంగీకారంతో
నిండి వుంటాయో,
ఎవరు ఆయన్ని దర్శించి స్పృశిస్తారో—
—వారు, సమస్త భయాలనుంచి
దుఃఖాలనుంచి విముక్తులౌతారు.
అటువంటి వానికి ఎడతెగని భగవచ్చింతన తప్ప
మరేదీ సంతోషాన్ని ఇవ్వదు.
నిరంతర ధ్యానమే, వాని దేహానికి
గంధం పూత పూసినట్లు వుంటుంది.
అతనుచేసే ప్రతి పని, తీసుకునే విశ్రాంతీ
సంగీతంతో నిండివుంటాయి.

ప్రేమ ప్రకాశాన్ని దూర దూరాలకు వెదజల్లుతాడు,
అతను.

ఎవడు ఏకమేవాద్వితీయుడో, అభేద్యుడో,
నిర్వికారుడో, శాశ్వతుడో, శాంత స్వరూపుడో—
ఎవడు ఘటము లన్నింటినీ అంచుల వరకు

ఆనందంతో నింపుతాడో,
ఏవడు ప్రేమ స్వరూపుడో,
అటువంటి వాని పాదాల్ని స్పృశించు," అంటాడు కబీరు.

*　　*　　*

# 71

ప్రియుని నివాస స్థలమైన సజ్జన సాంగత్యాన్ని
సమీపించు.
అప్పటినుంచి నీ ఆలోచనల్ని, ఆదేశాల్ని
ప్రేమతో గమనించు.
ప్రభు నామోచ్ఛరణ వినబడని కూటమి
కాల్చి, బూడిద కానియ్యి.
పరుడే లేనప్పుడు వివాహ భోజనాన్ని
నువ్వు ఎట్లా ఏర్పాటు చేస్తావు.

ఇంకా సంశయించకు. ఒక్క ప్రియుని గురించే యోచించు.
ఇతర దేవతారాధనకు మనసు పోనీయకు.
అన్యగురువుల్ని ఆరాధించడంలో గొప్ప ఏమీలేదు.

"నువ్వు ఆ విధంగా ప్రయత్నించావా,
ఎప్పటికీ నువ్వు ఆయన్ని కనుక్కోలేవు;"
అని నొక్కి చెపుతున్నాడు కబీరు.

*　　*　　*

## 72

బురదలో పడిన ఆభరణంకోసం,
అందరూ వెతుకుతున్నారు.
కొందరు తూర్పున - కొందరు పడమట
కొందరు నీళ్ళలో - కొందరు రాళ్ళలో వెదుకుతున్నారు.
కాని, దాస కబీరు దాని నిజమైన విలువ గుర్తించి,
తన ఉత్తరీయపు టంచున భద్రంగా మూట కట్టాడు.

*　　　*　　　*

## 73

నన్ను నా నాథుని ఇంటికి తీసుకువెళ్ళడానికి
పల్లకీ వచ్చింది.
అది నా హృదయాన్ని ఆనందంతో పులకరింప
జేసింది.
కాని, ఆ బోయీలు నా వారెవరూ లేని
ఒక నిర్జరారణ్యంలోకి నన్ను తీసుకుపోయారు.

ఓ బోయీల్లారా, మీ కాళ్ళు పట్టుకుని ప్రతిమాలతాను.
ఓ క్షణం ఆగండి.

వెనక్కి వెళ్ళి, బంధుమిత్రులనుండి నన్ను శలవు తీసుకో నివ్వండి.

"ఓ సాధూ, నువ్వు వెళ్ళబోయే ప్రదేశంలో
బజారుకాని, దుకాణాలుకాని లేవు.
నీ మంచి - చెడ్డలతో అమ్మడం - కొనడం
ఇక్కడే పూర్తి చేసుకో," అని
దాస కబీరు పాడతాడు.

* * *

## 74

ఓ హృదయమా, ఈ ప్రేమనగర రహస్యాలన్నీ
నీకు తెలియవు.
నువ్వు అజ్ఞానంలోంచి వచ్చావు.
తిరిగి అజ్ఞానంలోకే వెడతావు.
ఓ మిత్రమా, ఈ జీవితంలో నువ్వేం చేశావు?
మోయలేని రాళ్ళ బరువు నెత్తిన పెట్టుకున్నావు.
నీ కోసం దాన్ని ఎవరు దించుతారు?
నీ నెచ్చెలి అవతలి తీరాన వున్నాడు.
"అతన్ని ఎట్లా కలుసుకోవడమా?" అని
నువ్వు ఎన్నడూ మనసులో అనుకోవు.

నావ బద్దలైంది.
నువ్వు ఇంకా ఇవతలి గట్టునే కూర్చున్నావు.

అలలు నిన్ను నిష్కారణంగా కొడుతున్నాయి.
అవసాన కాలంలో నీకు సహాయం చేసే వారెవరు?
నువ్వు ఏకాకిగా వున్నావు.
నీకు తోడు, నీడ లేదు.
నీ కర్మ ఫలితం నువ్వే అనుభవిస్తావు.
దీన్ని యోచించమని దాస కబీరు అడుగుతున్నాడు.

* * *

# 75

ఈ సగుణ ప్రపంచానికి అతీతంగా
నిర్గుణం వుందని వేదాలు ఘోషిస్తున్నాయి.
"ఓ వనితా, ఆయన వీటన్నింటికీ అతీతంగా వున్నాడా?
లేక, వీటన్నింటిలో ఐక్యమై వున్నాడా?" అనే
తర్కంవల్ల నీకు ఏం ప్రయోజనం?
సమస్తం నీ నివాస స్థలంగా చూడు.
"సంతోషం - బాధ" అనే పొగమంచు
ఎప్పటికీ అక్కడి వరకు వ్యాపించదు.
అక్కడ పరబ్రహ్మ రాత్రింబవళ్ళు దర్శనమిస్తారు.
తేజస్సు ఆయన వస్త్రం.
కాంతి ఆయన ఆసనం.
ఆ కాంతి నీ శిరస్సుపై వుంది.
"ఆ తేజస్సే, సత్య స్వరూపుడైన సద్గురువు"
అంటాడు కబీరు.

* * *

# 76

నీ ప్రేమ నేత్రాన్ని తెరచి, విశ్వ వ్యాప్తమైన
ప్రభువును దర్శించు. ఆ సంగతే యోచించు.
అదే నీ జన్మభూమని తెలుసుకో.
నువ్వు నిజమైన సద్గురువును కలుసుకున్నప్పుడు
ఆయన నీ హృదయాన్ని మేల్కొల్పుతారు.
ప్రేమ - వైరాగ్యాల రహస్యాల్ని ఆయన
నీకు వెల్లడిస్తారు.
ఆయన విశ్వాతీతుడని అప్పుడు నీవు
నిశ్చయంగా తెలుసుకుంటావు.

ఈ ప్రపంచం, ఆయన సత్య నగరం.
దాని చిక్కుదారులు మనసును భ్రమింప జేస్తాయి.
బాట దాటకుండానే, మనం లక్ష్యాన్ని చేరుకోగలం.
అది అంతంకాని క్రీడ.
ఎక్కడైతే అనేక ఆనందాలు ఎప్పుడూ
ఆయన చుట్టూ నాట్యం చేస్తూ వుంటాయో,
అక్కడ శాశ్వతానందపు క్రీడా వుంటుంది.
మనం ఆ సంగతి తెలుసుకుంటే, ఆ తర్వాత
"స్వీకరించడం - పరిత్యజించడం" అనే
ప్రసక్తే వుండదు.
ఆనాటినుంచి ఏదో సాధించాలనే తాపత్రయమూ
మనలను దహించదు.

ఆయనే అంతులేని అంతిమ విశ్రాంతి.
ఆయన తన ప్రేమ స్వరూపాన్ని
విశ్వమంతా వ్యాపింపజేశారు.
సత్యవంతమైన ఆ తేజోమయ కిరణంనుంచి,
ఎడతెరపి లేకుండా కొత్త రూపాలు ఆవిర్భవిస్తున్నాయి.
ఆ రూపాల్లో ఆయన నిండి వున్నారు.

అన్ని పొదరిళ్ళూ, వనాలు, తోటలు
విచ్చుకున్న పువ్వులతో నిండి వున్నాయి.
గాలి, చిన్న చిన్న ఆనంద తరంగాలుగా విడిపోతోంది.

అక్కడ ఒక హంస అద్భుతంగా ఆడుతోంది.
అనంతుని చుట్టూ అనాహత సంగీతం
సుడిగా తిరుగుతోంది.
దాని మధ్య అపరిచితుని ఆసనం మెరుస్తోంది.
ఆ ఆసనంమీద పరబ్రహ్మ ఆసీనులై వున్నారు.
ఆయన ఒంటిమీది ఒక వెంట్రుక తేజస్సుకి
లక్షలాది సూర్యులు సిగ్గుపడుతున్నారు.

"బాట" అనే వీణమీద, మధురస్వరాలు నినదిస్తున్నాయి.
దాని స్వరాలు హృదయంలోంచి దూసుకు పోతున్నాయి.
అంతులేని జనన - మరణ జీవన వాహినులతో
దివ్యవాహిని క్రీడిస్తోంది.
ఎవరు సమస్త సత్యాలకు సత్యమో,
ఎవరిలో సమస్త సత్యాలు లయమై వున్నాయో
వారిని "శూన్యం" అని పిలుస్తారు.
తత్వశాస్త్రం ఆయన్ని అందుకోలేదు.

కాని, అన్ని తత్వశాస్త్రాలకు అతీతమైన సృష్టి
ఆయనలోంచి జరుగుతోంది.

ఓ సోదరా, అక్కడ అనంతమైన లోకం వుంది.
అందు వర్ణింప శక్యం కాని నామ రహితుడు వున్నాడు.
అక్కడకు చేరుకున్నవాడే, దాన్ని తెలుసుకుంటాడు.
అది విన్నదానికీ, చెప్పబడినదానికి
అన్నింటికీ భిన్నమైనది.
దానికి ఆకారం లేదు. దేహం లేదు.
పొడవు - వెడల్పు, ఏమీ లేదు.
అది "ఈ విధంగా వుంటుంది," అని నేనెట్లా చెప్పగలను?
ఎవరైతే అనంతత్వమనే బాటమీద నిలుస్తారో,
వారిమీద ప్రభువు దయ నిలుస్తుంది.
ఆయన్ని పొందిన వారు జనన - మరణ రహితులై,
ముక్తి పొందుతారు.
దాన్ని మాటల్లో వర్ణించలేము.
కాగితంమీదా పెట్టలేము.

"ఆ దివ్యానుభవం - తీపి పదార్థం తిన్న
మూగవాని అనుభవం మాదిరిగా వుంటుంది,"
అంటాడు కబీరు.

*           *           *

# 77

ఓ మనసా, నా హృదయాన్ని గట్టిగా ఆకర్షిస్తోన్న
నా ప్రియుని నివాస స్థలానికి వెళదామా?
బావిలోంచి నీరు తోడుకునేందుకు
ఆమెకు తాడు లేకపోయినా,
"ప్రేమ" అనే పాత్ర నింపుతోంది.

మేఘాలు ఆకాశాన్ని ఆవరించకపోయినా,
వర్షం, తుంపరగా పడుతోంది.
ఓ అశరీరుడా, నీ వాకిట్లో కూర్చోవద్దు.
వెళ్ళి, ఆ వర్షంలో స్నానం చెయ్యి.
అక్కడ ఎప్పుడూ చీకటి వుండదు.
వెన్నెల విరిసే వుంటుంది.
ఆ ప్రదేశం లక్షలాది సూర్యుల కాంతితో
ప్రకాశిస్తోంటే, ఒకే ఒక సూర్యుని గురించి
మాట్లాడేదెవరు ?

*　　　*　　　*

## 78

ఓ సాధూ, నా అమర వాక్కులు విను:
నువ్వు, నీ క్షేమం కోరుకునేవాడివైతే,
వాటిని నిజంగా పరిశీలించి, బాగా యోచించు.
నువ్వు ఎవరి నుంచి జన్మించావో, ఆ సృష్టికర్త నుంచి
విడిపోయి, వివేకాన్ని కోల్పోయి,
మృత్యువును తెచ్చి పెట్టుకున్నావు.

సమస్త సిద్ధాంతాలు - అన్ని బోధలు ఆయన్నించే
ఉద్భవించి, ఆయన ద్వారానే అవి పరిణతి చెందుతాయి.
ఆ సంగతి నిశ్చయమని తెలుసుకుని, నిర్భయంగా వుండు.
ఈ పరమ సత్యాన్ని నా నుంచి విను:
నువ్వు ఎవరి నామ సంకీర్తన చేస్తావు?

ఎవర్ని ధ్యానిస్తావు ?
ఈ బంధాలనుంచి బైటికిరా !
అందరి హృదయాల్లో ఆయన వున్నారు.
దిక్కుమాలిన శూన్యప్రదేశాన్ని ఎందుకు ఆశ్రయిస్తావు ?

గురువును నీ నుంచి దూరంగా వుంచితే,
నువ్వు ఆ దూరాన్నే గౌరవిస్తావు.
నిజంగా ఆయన దూరాన్నే వుంటే,
ఇంత ఈ ప్రపంచాన్ని సృష్టించేదెవరు ?
ఆయన దగ్గర లేరనుకుంటే, ఆయన కోసం
నువ్వు కన్నీళ్ళతో వృథాగా దూరదూరాలు
తిరిగి, తిరిగి వెదుకుతావు.
ఆయన దూరాన వుంటే, ఆయన్ని అందుకోవడం
అసాధ్యం.
ఆయన తమ చెంత వున్నారనుకున్నవారికి,
ఆయనే ఓ ఆనందం.

తన దాసుడు బాధపడకుండా, అతన్ని గాఢంగా
హత్తుకుంటారాయన," అని కబీరు అంటాడు.
ఓ కబీర్! నిన్ను నువ్వు తెలుసుకో! ఎందుకంటే,
ఆయన నీలో అపారమై సతతం నిండి వున్నారు.
నువ్వు నీ హృదయంలో స్థిరంగా ఆసీనుడవై,
ఆనందంగా పాడుకో !

*　*　*

## 79

నేను ఆస్తికుణ్ణి కాను. నాస్తికుణ్ణీ కాను.

నేను ధర్మాత్ముణ్ణి కాదు. అధర్మపరుణ్ణీ కాదు.

నేను ఏ నియమాలతోనూ బ్రతకడం లేదు.

ఏ అనుభవాలతోనూ నేను జీవించడం లేదు.

నేను వక్తను కాను. శ్రోతనూ కాను.

నేను సేవకుణ్ణి కాదు. యజమానినీ కాదు.

నేను బందీనికాను. స్వేచ్ఛా పరుణ్ణీ కాను.

నేను అనాసక్తుణ్ణీకాను - ఆసక్తుణ్ణీకాను.

నేను ఎవరికీ దూరంగా లేను - ఎవరికీ దగ్గరగా లేను.

నేను నరకానికి పోను - స్వర్గానికి పోను.

నేను సర్వ కర్మలూ ఆచరిస్తూ, వాటికి అతీతంగా వుంటాను.

నా ఉద్దేశ్యాన్ని అర్థం చేసుకున్నవారు, కొందరే వున్నారు.

దాన్ని తెలుసుకున్నవాడు, నిశ్చలంగా వుంటాడు.

కబీరు స్థాపించడానికిగాని,

నాశనం చేయడానికి గాని చూడటం లేదు.

*    *    *

సత్యనామం, మామూలు నామం వలె వుండదు.
నిర్గుణానికి, సగుణానికి భేదం, మాట మాత్రమే!
నిర్గుణం, బీజం. సగుణం, పుష్పం - ఫలం.
జ్ఞానం, కాండం. నామం, మూలం.

ఆ మూల మెక్కడ వున్నదో చూసి తెలుసుకున్నప్పుడు,
ఆనందిస్తావు.
ఆ మూలమే నిన్ను శాఖ దగ్గరకు - పత్రం దగ్గరకు
పుష్పం దగ్గరకు, ఫలం దగ్గరకు తీసుకుపోతుంది.
ప్రభువును ముఖాముఖి కలుసుకునేట్లు చేసేది
ఆ మూలమే.
ఆనందాన్ని అనుభవించేదీ, అదే!
నిర్గుణాన్ని - సగుణాన్ని కలిపేదీ ఆ మూలమే.

* * *

# 81

వర్ణరహితుడు, నిరాకారుడు, నిర్గుణుడు
పరిపూర్ణుడు - అయిన పరమేశ్వరుడు ఒక్కడే
ఆదిలో వున్నాడు.
అప్పుడు, ఆది - మధ్యాంతాలు లేవు.
దృష్టిలేదు, చీకటిలేదు. వెలుగులేదు.
వాయువు - ఆకాశం - అగ్ని - జలం - పృథ్వి
ఏమీ లేదు.
గంగ - యమునా మాదిరి నదులు లేవు.
సముద్రాలు - మహాసముద్రాలు - అలలు లేవు.
దుర్గుణం, సుగుణం లేదు.
వేదాలు - పురాణాలు - ఖురాన్ మాదిరి
లిఖిత పూర్వక గ్రంథాలూ లేవు.

"చైతన్యం లేదు.
అంతుతెలీని అగాధమైన తన ఆత్మ లోతుల్లో
పరమేశ్వరుడు అంతర్లీనంగా వున్నాడు,"
అంటాడు కబీరు.

గురువు తినడు, తాగడు.
జీవించడు, మరణించడు.
ఆయనకు ఆకారంలేదు. వస్త్రంలేదు.
కులం, వర్గ పరంపర ఏమీ లేనివాడు.

నేను ఆయన మహిమను ఏమని వర్ణించను?
ఆయన సాకారుడు కాదు. నిరాకారుడూ కాదు.
ఆయనకు నామంలేదు. నివాస స్థలమూలేదు.
ఆయనకు రంగులేదు. రంగులేకపోవడమూ లేదు.
అట్టి వానిని గురించే కబీరు మనసులో ఆలోచిస్తున్నాడు.

*  *  *

# 82

"నిరాకారుడు, నిర్గుణుడు అయిన వాడు
విశ్వ వ్యాప్తుడై వున్నాడు," అని కబీరు ఆలోచించి అంటాడు.

విధాత తన ఆనందక్రీడను, సృష్టి రూపంలోకి తెచ్చాడు.
ఓంకారం నుంచే, ఈ సృష్టి ఉద్భవించింది.
భూమి ఆయన ఆనందం.
ఆయన ఆనందమే, ఆకాశం.
సూర్య - చంద్రుల కాంతే, ఆయన ఆనందం.
ఆది - మధ్యాంతమే, ఆయన ఆనందం.
చీకటి, వెలుగు ఆయన ఆనందం.
మహాసముద్రాలు, కెరటాలు ఆయన ఆనందం.
గంగ - యమున - సరస్వతులు ఆయన ఆనందం.
ఒక్కడే గురువు.

జనన, మరణాలు; సంయోగ, వియోగాలు
అన్నీ ఆయన ఆనంద క్రీడలు.
భూమి - నీరు సమస్త విశ్వం ఆయన ఆట.
భూమి - ఆకాశం ఆయన ఆట.
ఆ ఆటలో సృష్టి వ్యాపించింది.
ఆ ఆటలోనే, అది స్థాపించబడింది.

"ఈ విశ్వమంతా ఆయన ఆటలో విశ్రమిస్తుంది.
అయినప్పటికీ ఆ ఆటగాడు అజ్ఞాతంగానే వుండిపోయాడు"
అంటాడు కబీరు.

* * *

# 83

వీణానాదం మృదుమధురంగా వినవస్తోంది.
కాళ్ళు, చేతులు లేకుండా నృత్యం జరుగుతోంది.
వేళ్ళతో మీటకుండా, వీణ మోగుతోంది.
ఆయనే చెవి, శ్రోత గనుక చెవులు లేకుండా
సంగీతం వినబడుతోంది.
ద్వారం మూసి వుంది.

కాని, లోపల పరిమళవంతంగా వుంది.
ఆ సంయోగాన్ని ఎవరూ దర్శించలేరు.
వివేకులే దాన్ని గ్రహించగలరు.

* * *

# 84

ఆది భిక్షువు భిక్షాటనకు వెళ్ళాడు.
కాని, నేను ఆయన్ని అక్కడ చూడలేకపోయాను.
ఆ బిచ్చగాని నుంచి నేనేం యాచించను?
నేను అడక్కముందే, ఆయనే ఇస్తారు.

"నేను ఆయన వాణ్ణి.
జరగవలసిందేదో, జరగనియ్యి," అంటాడు కబీరు.

*    *    *

# 85

నా ప్రియుని సాన్నిధ్యం కోసం నా హృదయం విలపిస్తోంది.
నాథుని నగరాన్ని పోగొట్టుకున్న ఆమెకు, ఇంక
ఇంటా — బైటా ఒకటే.
నా హృదయానికి దేంట్లోనూ ఆనందం
లభించడం లేదు.
నా మనసు, దేహం కలవరపడుతున్నాయి.

ఆయన భవనానికి పది లక్షల ద్వారాలున్నాయి.
ఆ భవనానికీ, నాకూ మధ్య మహాసముద్రం వుంది.
ఆ మార్గం అనంతంగా పరచుకుని వుంది.
ఓ నేస్తమా, అనంతమైన ఆ సముద్రాన్ని
నేను ఎట్లా దాటగలను?

ఈ వీణ, ఎంత అద్భుతంగా మోగుతోంది?
దాన్ని తీగల్ని సరిగా మీటినప్పుడు,
అది హృదయాన్ని పిచ్చెక్కిస్తుంది.
కాని, దాని బిరడాలు విరిగి, తీగలు వదులైతే,
ఎవరూ దాన్ని ఏ మాత్రం లక్ష్యపెట్టరు.

ఉదయమే ప్రభువు సన్నిధికి వెళ్ళి తీరాలని
నేను, నా తల్లి - తండ్రులకు నవ్వుతూ చెప్పాను.
నేను వెళ్ళడం, వాళ్ళకు ఏ మాత్రం ఇష్టంలేక,
నా మీద కోప్పడ్డారు.
నేను, నా ప్రియుని దగ్గర సర్వాధికారాలూ
సంపాదించాననీ, నేను ఏది కావాలంటే
అది – ఆయన్నించి సులభంగా పొందగలననీ—
అందుచేత నేను ఆయన దగ్గరకు వెళ్ళడానికి
ఆరాట పడుతున్నాననీ
వాళ్ళు, తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.
ప్రియమిత్రమా, ఇది ప్రేమ రాత్రి.
ఇప్పుడే నా ముసుగు నెమ్మదిగా తొలగించు.

"నేను చెప్పేది ఆలకించు:
ప్రియ సమాగమం కోసం, నా ఎద ఆరాటపడుతోంది.

నిద్రపోకుండా, పక్కమీద పడుకున్నాను.
ఉదయమే నన్ను జ్ఞాపకం చేసుకో," అంటాడు కబీరు.

*　　　　*　　　　*

## 86

ఈ జీవితాలయంలో వున్న దైవాన్ని సేవించు.
గాఢాంధకారం కమ్ముకొస్తోంది.
పిచ్చివానిలా నటించకు.
నా కోసం ఆయన యుగయుగాలు నిరీక్షించారు.
నా యందుండే ప్రేమచేత, ఆయన నిస్పృహ చెందారు.
అయినా నా ప్రేమ ఇంకా మేల్కొలేదు.
నా చెంతనున్న ఆనందాన్ని,
నేను తెలుసుకోలేకపోయాను.
కాని, నా చెవిలో మోగిన స్వరభావాన్ని,
నా ప్రియుడు నాకు ఇప్పుడు తెలియజేశాడు.
ఇప్పుడూ నా అదృష్టం కలసి వచ్చింది.

"నా అదృష్టం ఎంత గొప్పదో చూడు!
ప్రియుని అపార లాలనను పొందాను," అంటాడు కబీరు.

*　　　　*　　　　*

# 87

ఆకాశంలో మబ్బులు దట్టంగా కమ్ముకున్నాయి.
వాటి భీకర ఘోష విను.
వినుగెత్తించే రొదతో, తూర్పు వానలు కురుస్తున్నాయి.
నీ పొలం గట్లమీద నుంచి, కంచెలమీద నుంచి
వర్షపు నీరు పొంగి, పొర్లకుండా జాగ్రత్తపడు.

నిర్వాణ క్షేత్రాన్ని సిద్ధపరచు.
"ప్రేమ - పరిత్యాగం" అనే లతల్ని
జల్లు వానలో తడవనియ్యి.
వివేకియైన రైతు, పండిన ధాన్యాన్ని ఇంటికి తెచ్చి,
సాధువులకూ, సత్పురుషులకు సంతర్పణ చేస్తాడు.

* * *

# 88

నా ప్రియమైన ప్రభువు ఈరోజు నా ఇంట
అతిథిగా వున్నారు.
నేడు సుదినం. ఈరోజు నాకు అన్ని రోజుల
కన్నా ప్రియమైనది.

ఆయన ఉనికితో నా గది — ఆవరణ
అంతా అందంగా వున్నాయి.
నా ఆశలు ఆయన నామాన్ని ఉచ్చరిస్తో,
ఆయన మహా సౌందర్యంలో అంతరించాయి.
నేను ఆయన పాదాలు కడిగాను.
ఆయన ముఖ దర్శనం చేసుకుని,
నా శరీరాన్ని, మనసునీ — నా సర్వస్వాన్ని
ఆయన ముందు కానుకగా అర్పించాను.
నా పెన్నిధి అయిన నా ప్రియతముడు
ఈరోజు నా ఇంటికి విచ్చేయడం
నాకెంతో సంతోషంగా వుంది.

"ప్రభువును తిలకించగానే, నా మనసులోని
దుష్టత్వాలన్నీ ఎగిరిపోయాయి.
నా ప్రేమ ఆయన్ని స్పృశించింది.
సత్యనామం కోసం నా హృదయం ఆరాటపడుతోంది."
అని దాసులకు దాసుడైన కబీరు గానం చేస్తున్నాడు.

  

## 89

ఆకాశంలో ఆవిర్భవించే పవిత్రమైన సంగీతాన్ని
వినే వివేకులెవరైనా వున్నారా?

సామగాన మూలమైన ఆయన, ఘటములన్నింటినీ
పూర్తిగా నింపి, తాను పరిపూర్ణంగా వున్నాడు.
శరీరధారుడు ఎప్పుడూ దప్పికతో వుంటాడు.
విడిపడ్డాడు గనుక, ఆయన కోసం వెదుకుతాడు.
కాని, ప్రేమ - పరిత్యాగాన్ని ఏకం చేస్తో,
"ఆయనే ఇది, ఇదే ఆయన," అనే శబ్దం
ఎప్పుడూ చాలా లోతుల్లోంచి వెల్లుబికి వస్తుంది.

"ఓ సోదరా, అదే అసలు సత్యం," అంటాడు కబీరు.

* * *

## 90

నా ప్రియుని గురించి తెలుసుకునేందుకు
నేను ఎవరి దగ్గరకు వెళ్ళను?
చెట్లను నిర్లక్ష్యం చేస్తే, అరణ్యాల్ని
ఎప్పటికీ ఎట్లా కనుక్కోలేవో,

అట్లాగే; ప్రభువునుకూడా విడిగా,
ప్రత్యేకంగా చూడలేవు," అంటాడు కబీరు.

* * *

## 91

నేను సంస్కృతం నేర్చుకున్నాను గనుక,
అందరూ నన్ను మేధావంతుడంటున్నారు.
కాని, నేను దిక్కులేకుండా నీటిలో
కొట్టుకుపోయినప్పుడూ,
దాహంతో వేగిపోయినప్పుడూ
వాంఛా వేదనతో దహించుకుపోతున్నప్పుడూ
నేను నేర్చుకున్న సంస్కృతం నాకు ఏం ఉపయోగ
పడింది?

"గర్వం, అహంకారాల బరువు నెత్తిన పెట్టుకుని,
నిష్కారణంగా మోస్తున్నావు.
ఆ భారాన్ని కింద దుమ్ములో పడేసి,
ప్రియుని కలుసుకునేందుకు ముందుకు సాగిపో.
ఆయన్ని నీ ప్రభువుగా సంబోధించు,"
అంటాడు కబీరు.

* * *

# 92

ప్రియుని ఎడబాసిన విరహిణి రాట్నంతో
నూలు వడకుతోంది.
దేహమనే నగరం, అందంగా వెలసింది.
అందు మనస్సనే భవనం నిర్మించబడింది.

ఆకాశంలో ప్రేమ చక్రం తిరుగుతోంది.
జ్ఞానా భరణాలతో ఆసనం అమర్చబడింది.
ఆమె ఎంతో సన్నని దారాలు తీసి,
భక్తి - ప్రేమలతో వాటిని అందంగా అల్లుతోంది.

"రేఖవళ్ళు," అనే హారాన్ని నేను అల్లుతున్నాను.
నా ప్రియుడు వచ్చి, నన్ను సమీపించి,
తన పాదాలతో నన్ను తాకినప్పుడు,
నా కన్నీళ్ళను ఆయనకు కానుకగా
అర్పించుకుంటాను.

* * *

# 93

నా చక్రవర్తి ఉజ్వల ఛత్రం కింద
శతకోటి సూర్య - చంద్ర - నక్షత్రాలు
ప్రకాశిస్తున్నాయి.

ఆయన నా మనసులో మనసు,
నా చూపులో చూపు.
నా మనసూ - దృష్టి ఏకమౌతాయా?
నా ప్రేమ తప్పకుండా నా ప్రియుణ్ణి
చేరుకుంటుందా? తీవ్రమైన నా హృదయాగ్ని
చల్లారుతుందా?

ప్రేమను నువ్వు ప్రియునిలో లీనం చేసినప్పుడు,
ఆ ప్రేమ పరిపూర్ణమౌతుంది," అంటాడు కబీరు.

* * *

## 94

ఓ సాధూ, దుఃఖరహితమైనది, నా ప్రదేశం.
రాజునుంచి, యాచకుని వరకు—
పాదుషానుంచి, ఫకీరు వరకు
అందరికీ గట్టిగా అరచి చెపుతున్నాను:

ఆయనలో రక్షణ పొందాలని చూసే వారందర్నీ
నా ప్రదేశానికి వచ్చి, స్థిరపడనియ్యి.
అలసిన వానిని వచ్చి, తన భారాన్ని ఇక్కడ
దించుకోనియ్యి.

నా సోదరా, అవతలి తీరానికి సునాయాసంగా
దాటాలంటే, నువ్వు ఈ ప్రదేశంలోనే వుండాలి.
భూమి - ఆకాశం - చంద్రుడు - నక్షత్రాలు
లేని ప్రదేశమది.

నా ప్రభువు దర్బారులో దివ్యతేజస్సు ఒక్కటే
ప్రకాశిస్తోంది.
"ఓనా ప్రియమైన సోదరా, సత్త్వం తప్ప
మరేదీ ముఖ్యంకాదు," అంటాడు కబీరు.

* * *

# 95

నేను నా నాథునితో కలసి ఆయన ఇంటికి వెళ్ళాను.
కాని, నేను ఆయనతో కలసి కాపురం చేయలేదు.
ఆయనతో సుఖాన్ని అనుభవించలేదు.

నా యవ్వనమంతా కలలాగ కరిగిపోయింది.
నా పెళ్ళినాటి రాత్రి, నా స్నేహితురాండ్రందరూ
కలసి, నాకు మంగళహారతులు పట్టారు.

బాధా - సంతోషాలనే తైలం పూసి
తలంటి పోశారు.

ఆ వేడుక పూర్తయింది.
నేను నా ప్రియుణ్ణి వదలి వచ్చేశాను.
నన్ను ఓదార్చాలని దారిలో
నా బంధుమిత్రులు ప్రయత్నించారు.

"నేను నా ప్రియుని ఇంటికి ప్రేమతో వెళ్ళి,
ఆనందంతో భేరి మ్రోగిస్తాను," అంటాడు కబీరు.

* * *

## 96

ఓ నా ప్రాణ సఖా, బాగా యోచించు.
నువ్వు నిజంగా ప్రేమిస్తే, నిద్ర పోతావెందుకు?
నువ్వు ఆయన్ని దర్శిస్తే, నిన్ను నువ్వు పూర్తిగా
ఆయనకు అర్పించుకో.
ఆయన్నే సర్వస్వంగా స్వీకరించు.
మళ్ళా-మళ్ళా ఆయన్ని ఎందుకు వదలుకుంటావు?
నీ కళ్ళను గాఢనిద్ర కమ్మితే,
పరుపు వేసుకుంటో, తలగడ సర్దుకుంటో
కాలాన్ని ఎందుకు వృథా చేస్తావు?
నేను నీకు ప్రేమ మార్గాన్ని చెపుతాను విను:

"శిరస్సే అర్పించవలసి వస్తే,
దానికై విచారించకూడదు," అంటాడు కబీరు.

*　　*　　*

## 97

ప్రతి విత్తనంలోనూ బీజమున్నట్లు,
ప్రభువు నీలో - నాలో వున్నారు.
ఓ దాసుడా, దురహంకారాన్ని దూరంగా పెట్టు.
ఆయన కోసం నీలో వెదుకు.

శతకోటి సూర్యులు కాంతితో ప్రకాశిస్తున్నారు.
నీలపుచాందిని ఆకాశంలో పరచుకుంది.
నేను ఆ ప్రపంచం మధ్య కూర్చున్నప్పుడు,
జీవన తాపం ఉపశమించింది.
అన్ని మాలిన్యాలూ తుడిచిపెట్టుకుపోయాయి.

మోగించకుండా వెలువడే గంటల - భేరీల
శబ్దాల్ని జాగ్రత్తగా విను.
ప్రేమలో ఆనందాన్ని అనుభవించు.
నీళ్ళులేకండానే వర్షం పడుతోంది.

కాంతి వాహినులే, నదులుగా ప్రవహిస్తున్నాయి.
ప్రేమ ఒక్కటే అంతటా వ్యాపించివుంది.
దాని గురించి పూర్తిగా తెలిసినవారు
కొందరే వున్నారు.
దాన్ని విచక్షణా దృష్టితో చూడాలని
ఆశపడేవారు అంధులు.

ఆ విచక్షణా దృష్టే, ఎడబాటుకి కారణం.
దాని కేంద్రం చాలా దూరానవుంది.
ఈ పరమానందం మధ్య నిలబడి
తనలోతాను పాడుకునే కబీరు ఎంత ధన్యుడో!

అది - ఆత్మ, పరమాత్మలో ఐక్యమైనప్పటి
సంగీతం.
అది – సమస్త దుఃఖాల్ని మరిపించే సంగీతం.
అది – లోపలకు వచ్చే, బైటికి పోయే వాటి
అన్నింటినీ ఉత్కృష్ట పరిచే సంగీతం.

*　　　*　　　*

# 98

వసంతం సమీపిస్తోంది.
నన్ను నా ప్రియునితో కలిపేదెవరు?
సమస్త సౌందర్యాల్లో లీనమైవున్న
నా ప్రియుని అందాన్ని నేను ఏ మాటలతో
వర్ణించగలను?
ప్రపంచంలోని ప్రతి చిత్తరువునందు
ఆయన వర్ణం వుంది.
అది శరీరాన్ని, మనసుని మంత్రించేస్తుంది.
దాన్ని ఎరిగిన వారు వర్ణనాతీతమైన
వసంతకాలపు లీల తెలుసుకుంటారు.

"ఓ సోదరా, నా మాట విను:
దాన్ని బాహ్యంగా తెలుసుకున్న వారు
ఎంతో మంది లేరు," అంటాడు కబీరు.

  

# 99

ఓ నారదా,

నా ప్రియుడు నాకు దూరమై వుండలేడని
నాకు తెలుసు.
నా ప్రియుడు మేల్కొంటే, నేనూ మేల్కొంటాను.
ఆయన నిద్రపోతే, నేనూ నిద్రపోతాను.
నా ప్రియుణ్ణి బాధ పెట్టేవాడు,
పూర్తిగా నాశనమౌతాడు.
ఆయన్ని స్తుతిస్తో పాడేచోట, నేను వుంటాను.
ఆయన కదిలినప్పుడు, నేను ఆయన ముందు
నడుస్తాను.
నా ప్రియుని కోసం నా హృదయం
ఆరాటపడుతోంది.

అనంత యాత్ర, ఆయన పాదాల చెంత
పరచుకుని వుంది.
లక్షలాది భక్తులు, ఆసీనులై వున్నారు.

"నిజమైన ప్రేమ వైభవాన్ని
ఆయనే వ్యక్త పరుస్తారు," అంటాడు కబీరు.

• • •

# 100

ఈరోజు ప్రేమ ఉయ్యాల కట్టు.
ప్రేమానంద తన్మయత్వంలో
ప్రియుని బాహువుల మధ్య
మనసునీ – దేహాన్నీ వూగనియ్యి.

అశ్రుపూరిత వర్షపు మేఘ పరం పరల్ని
నీ నయనాల్లో ప్రతి ఫలించనీ.

తమోచ్ఛాయతో నీ మనసును కప్పు.
ఆయన చెవి దగ్గరకు నీ ముఖాన్ని చేర్చు.
గాఢమైన నీ హృదయ వాంఛల్ని
ఆయనకు చెప్పు.

"ఓ సోదరా, నా మాట విను:
నీ యెదలో ప్రభువుని దర్శించు," అంటాడు కబీరు.



గాలి వీచకపోతే,
దుమ్ము దూరాలకు పోదు.

కెరటం లేవకపోతే,
నురుగు పైకి తేలదు.

దుమ్మును చూడ్డం కన్నా, గాలిని చూడ్డం
నురుగును చూడ్డం కన్నా, సముద్రాన్ని
చూడ్డం, మంచిది.

లో దృష్టితో నీలోకి చూసుకో.
తక్కిందంతా రక్తం - మాంసం - ఎముకలు—
నరాలు.
ఏకాగ్రచిత్తంతో దేహాన్నంతా కేంద్రీకరించు.
సంపూర్ణ ఎరుకలో సద్వస్తువుగా నిలిచిపో.
చూసేదీ - చూడబడేదీ - చూస్తున్నదీ
నువ్వే అయిపో; అంటాడు, రూమీ.

కలుసుకోవాలనే కాంక్ష వుంటే,
ప్రతిక్షణం ప్రగాఢ ప్రేమను
రగుల్చుకుంటూ వెళ్ళు.

అహంకారాన్ని కాల్చి, బూడిదచేసి,
దాన్ని ఒళ్ళంతా పూసుకుని సాగిపో.

"అద్వైతం" అనే చీపురు చేతపట్టుకుని,
హృదయాలయంలోని దైవత్వాన్ని ఊడ్చెయ్యి.

ద్వైత ధూళిని పూజా పీఠాలమీద
చల్లుకుంటూ ముందుకు సాగిపో.

పూజాపీఠాన్ని నెట్టి పారెయ్యి.
జపమాలను తెంచెయ్యి.

గ్రంథాల్ని విసిరి, గంగలో పారెయ్యి.
ప్రవక్తల చెయ్యిపట్టుకుని
"నేను వారి దాసుణ్ణి" అని చాటుకుంటూ వెళ్ళిపో.

ఉపవాసాలు ఉండవద్దు.
వ్రతాలు చేయవద్దు.
మశీదుకి పోవద్దు, మోకరిల్ల వద్దు.
పవిత్రోదకపు కలశాన్ని పగలగొట్టు.
వాంఛా మధువును తాగుతూ వెళ్ళిపో.

ఎప్పుడూ తింటో, తాగుతో వుండు.
కాని, అనుక్షణం ప్రమత్తుడవై వుండు.
తాగిన నిషాలోనే తిరుగు.

అహంకారాన్ని కాల్చుకుంటో వెళ్ళిపో.
మౌల్వీ కావద్దు.
పూజారివీ కావద్దు.
ద్వైత పూజమానుకో.

"అహంబ్రహ్మాస్మి" అనే
షాహ్ కలందర్ హుకుం చాటుకుంటో
సాగిపో.

"నేను హృదయంలో సత్యాన్ని దర్శించాను.
అదే మస్తానుల మధుశాల.
అక్కడికి వస్తోవుండు, అంటాడు
మన్సూర్ మస్తాన్.





# శ్రీ ఎం. కృష్ణశర్మ
# రచనలు

| | |
|---|---|
| భగవాన్ రమణ మహర్షి | — 40 . 00 |
| కృష్ణాజీ జీవితం | — 60 . 00 |
| (జిడ్డు కృష్ణమూర్తి) | — |
| మహారాత్రి | — 6 . 00 |
| నిశ్చల మనస్సు | — 15 . 00 |
| అనుభవ ధూళి | — 10 . 00 |
| రమణ బోధలు | — . 00 |
| ప్రవక్త | — 15 . 00 |
| కబీరు గీతాలు | — 15 . 00 |
| మహోత్సవం | — 15 . 00 |
| ఖలీల్ జిబ్రాన్ | — 15 . 00 |